# తొలిపలుకు

ఇటీవలఁ బ్రభుత్వమువారు ప్రచురించిన దేశభాషాపారప్రణాళికలోఁ బరిశ్రమలు చారిత్రకాంశములు మున్నగు వానితోపాటు పరిశోధనలకును నూతన ప్రదేశాన్వేషణము నకును ప్రముఖ స్థానమొసంగఁ బడియున్నది. మనభాషలోఁ బౌరాణిక కథా వస్తు శోభితములైన గ్రంథములు పెక్కు గలవు గాని పరిశోధనా న్వేషణములఁ గూర్చి వివరించు గ్రంథములు మిక్కిలి తక్కువగా నున్నవి. చరిత్రాదులలో నావిషయము లించుక స్పృశింపఁబడును గాని సూక్ష్మాంశములతోఁ గూడ వివరింపఁబడి యుండవు. అందుచే బాలురకట్టి పరిశోధకులయు నన్వేషకులయు సాహస ప్రయాణములతోఁ బరిచయము కలిగించి సాహసకార్యా చరణాసక్తి (Adventurous spirit) పుట్టించుటకై యీ ప్రయత్నముచేయఁ బడినది.

సుమారైదు శతాబ్దములకుఁ బూర్వము మెరికా ఖండమనున దొకటి భూభాగమున నుండెనని ప్రాచ్యులకుఁ గాని పాశ్చాత్యులకుఁ గాని తెలియకుండెను. ధన సుగంధ ద్రవ్యసంపన్నమైన హిందూదేశమునకు మార్గము కనుఁ గొనవలెనని స్పెయిను పోర్చుగలు రాజులు ప్రయత్నించు చుండిరి. కొలంబసు మార్గమును గనుఁగొన వలెనను నుద్దేశముతోనే పడమరగా నట్లాంటికు మహాసముద్రమునఁ బయనించి పడమటి ఇండియాదీవులను గనుఁగొనెను. పిమ్మట నీ పరిశోధనము నూత్నప్రపంచ పరిశోధనకు దారి చూపెను. వాస్కోడగామా పోర్చుగలు రాజు ప్రేరణమున గుడ్ హోపగ్రిమును జుట్టి హిందూదేశము నందలి కళ్లికోటచేరి కొన్నియమూల్య వస్తువులతోఁ దిరిగి మాతృదేశము చేరెను. అతని యీ ప్రయాణము పాశ్చాత్య భారతదేశముల పరస్పర సంబంధమునకును వాణిజ్య వ్యాపారములకును మార్గదర్శక మాయెను. డ్రేకు మహాసాహసమునఁ బ్రపంచ పర్యటనమొనరించి, విస్తార ధనము కొల్ల గొట్టి, యాంగ్లదేశ రాజ్ఞియైన యెలిజబెత్తు వలన నపారగౌరవ మొందెను.

పిమ్మటఁ బలువురు సాహసికులు సముద్రములపైఁ బయనించి యజ్ఞాత పూర్వములైన ప్రపంచభాగములఁ బరిశోధించి ఖ్యాతిగడించిరి. ఇప్పటికిఁ బ్రపంచముననే భూభాగమెచ్చట నున్నదో కొంతవఱకెల్లరకును దెలియ వచ్చినది. ఈ విజ్ఞానమునకు మార్గదర్శకులైన సాహసికుల ప్రయాణ వృత్తాంతము లీ గ్రంథమునఁ గథారూపమున సరళమైన భాషలో వర్ణింపఁ బడినవి. విద్యాశాఖాధికారు లీమా ప్రయత్నము నౌచిత్యము గమనించి తగిన విధమునఁ దోడ్పడుదురని ప్రార్థించు చున్నాము.

ప్రకాశకులు.

ఆశియా
ఐరోపా
ఆఫ్రికా
ఉత్తర అమెరికా
దక్షిణ అమెరికా
ఆస్ట్రేలియా
తూర్పు ఇండియా ద్వీపులు
గుడ్‌హోపు అగ్రము
పనామా
మడగాస్కర్

| | |
|---|---|
| సర్ ఫ్రాన్సిస్ డ్రేక్ మార్గము | ——— |
| కొలంబస్ మార్గము | – – – – |
| వాస్కోడగామా మార్గము | - - - - - |

మార్గదర్శకుల ప్రయాణములను దెలుపు పటము

# మార్గదర్శకులు

## 1. క్రిష్టాఫరు కొలంబసు.

1. ఆధునిక ప్రపంచమున భోగభాగ్యములకు మిక్కిలి ప్రసిద్ధి వహించిన దమెరికాఖండము. సుమా రైదువందల యేండ్లకుఁ బూర్వ మీ ఖండము భూభాగమున నుండెనని పాశ్చాత్యులకుఁగాని ప్రాచ్యులకుఁగాని తెలియదాయెను. క్రీ. శ. 15 వ శతాబ్దిలో యూరపుఖండమునందలి తీరస్థదేశములవారు మణిహిరణ్యాదులకును, సుగంధద్రవ్యములకును పేరువడసిన ప్రాచ్యదేశముల కట్లాంటిక్కుసముద్రముద్వారా యొక సముద్రమార్గమును గనుఁగొనవలెనని ప్రయత్నించియుండిరి. ఈ ప్రయత్నము లామార్గమును గనుఁగొనుట కంతగాఁ దోడ్పడకపోయినను మఱొక క్రొత్తప్రపంచము బయటఁబడుటకుఁ గారణము లాయెను. ఈ నూత్నప్రపంచము నన్వేషణమునకు మార్గదర్శకులైన సాహసికాగ్రగణ్యులలోఁ గ్రిష్టాఫరు కొలంబసు మున్ముందు పేర్కొనఁదగియున్నాఁడు. ఈతని ప్రయాణమే నూతనప్రపంచవిజ్ఞానమునకు నాంది యని చెప్పవచ్చును.

2. క్రిష్టాఫరు కొలంబసు క్రీ. శ. 1436 వ సంవత్సరమున జినోవాపట్టణమున జన్మించియుండెను. ఈతఁడు బాల్యమునుండియు నావికశిక్షణము నంది, తన యిరువదినాల్గవయేట నావికాగ్రేసరుఁడని పేరొందిన హెన్రీ ప్రఖ్యాతిచే నాకృష్టుఁడై పోర్చుగలుదేశమున కేగెను. అచ్చట నితఁ డొక నావికుని

కూఁతును బెండ్లాడి ప్రపంచపటములఁ దయారుచేయుచుఁ

గుటుంబపోషణ మొనరించుకొనుచుండెను. ఈ కారణముచే



క్రిష్టాఫరు కొలంబసు

నీతని కాఫ్రికాతీరమున కంతకుముందే ప్రయాణము కావించి వచ్చిన పలువురు సుప్రసిద్ధనావికులతోఁ బరిచయ మేర్పడెను. అప్పటినుండియు నీతఁడు భూగోళపరిస్థితులను శాస్త్రీయ దృష్టితోఁ బరిశీలించుచు క్రీ. శ. 1474 వ సంవత్సరమునఁ బశ్చిమముగాఁ బయనించినచో హిందూదేశమునకు సముద్ర మార్గమును గనుఁగొనవచ్చునని తలంచెను. ఈ యుద్దేశము

నాతఁడు తన స్నేహితుఁడైన టాస్కనెల్లి యను వైద్యున కెఱింగింప నాతఁ డది విని యమితమైన ప్రోత్సాహము నొసంగెను. మఱికొందఱు కొలంబసు నుద్దేశము నెఱింగి యది యసంభవమని యాతని గేలిసేసిరి. కొలంబసు మాత్రము నిరుత్సాహము నొందక యీ విషయమున నూతనాంశము లేవైనఁ దెలియవచ్చునేమోయని తన పరిశీలనము సాగించుచునేయుండెను.

**3.** మొట్టమొదటఁ గొలంబసు ప్రయత్నమును దన మాతృభూమియైన జినోవా కెఱింగించెను. కాని యచ్చటివా రాతని యుద్దేశమును గొనసాగించుట కంగీకరింపరైరి. ఆ కాలమునఁ బోర్చుగీసువారు హిందూదేశమునకు సముద్రమార్గమును గనుఁగొనుటకై యత్నించుచుండిరని విని కొలంబసు పోర్చుగలు రాజునకుఁ దన యూహ తెలిపెను. అప్పటి పోర్చుగలురాజైన రెండవజాను ప్రీతి పూర్వకముగా నాతనిఁ దన యాస్థానమునకుఁ బిలిపించి, యాతఁడు చెప్పినదంతయు సావధానముగా వినెను. ఆఫ్రికా ఖండమును జుట్టిపోనక్కఱ లేకుండఁగనే పడమరగా నేగినచో హిందూదేశమునకుఁ బోవచ్చునని కొలంబ సాతనికి నిరూపించి చూపెను. రాజాతని యూహ సరియైనదేయని తలంచి, యాతని నాదరించు నుద్దేశముతో నావిషయము తన మంత్రుల కెఱింగించెను. ఆమంత్రులది యసంభవమని తమ యభిప్రాయము తెలిపిరి. రాజు వారి యభిప్రాయముతో నేకీభవింపఁజాలక మఱికొందఱు మిత్రులతో నావిషయమును దెలుప వారు కొలంబసు కడనున్న పటములు తెప్పించి యొక నౌక నందలి యాథార్థ్యము

నెఱుంగుటకై పడమరగాఁ బంపవలెననియు, నంతవఱకుఁ గొలంబసు నేదో మిషపై నాపియుంచవలెననియు నాలోచన చెప్పిరి రాజట్లొనరించెను. కొలంబ సిదియంతయు నెఱింగి, రాజట్టి కుటిలోద్దేశముతోఁ దన పటములు గ్రహించినందుల కెంతయుఁ జింతించి, యితరదేశములవారిసాహాయ్యమునఁ దన మనోరథము నీడేర్చుకొనుటకై పోర్చుగలు విడిచి యరిగెను.

4. పిమ్మటఁ గొలంబసు తన సోదరుఁడైన బార్థలోమియో నిగ్లండు రాజైన హెన్రీతో సంప్రదించుటకుఁ బంపి తాను స్వయముగా స్పెయిను దేశమున కేగెను. తన ప్రయత్నము సుసంభవమని యితరుల నమ్మించుట యెంత కష్టమో కొలంబసున కిప్పటికిఁ దెలియవచ్చెను. అయ్యు నింగ్లండు స్పెయిను దేశపు రాజులలో నొక్కరైనఁ దనకుఁ జేయూఁత నొసంగరాయని యాతఁడు ధైర్యము వహించి ప్రయత్నము సాగించెను. బార్థలోమియో యింగ్లండున కేగుచుండ సముద్రచోరులాతని నడ్డగించి యాతని ప్రయాణము నాటంకపఱిచిరి. లేనిచో నొక చరిత్రకారుఁడు చెప్ప యుండినట్లు పడమటి యిండియాదీవు లింగ్లండు దేశపక్షము ననే కనుఁగొనఁబడియుండును. బార్థలోమియో హెన్రీకిఁ దన సోదరుని యుద్దేశము నెఱింగింపఁగనే యాతఁడు వెంటనే సాహాయ్యము చేయుట కంగీకరించెను. కాని కొలంబసు తన సోదరుఁ డెందుచేత నాలస్యము చేసెనో యెఱుంగక యాతఁడు తిరిగి వచ్చువఱకు నాగకుండఁగనే తన యూహ ననుసరించి ప్రయాణము సాగించెను.

5. ఈ ప్రయాణము సాగించుటకు ముందు కొలంబసు పడిన కష్టము లిన్నియన్ని కావు. అమితమైన పట్టుదలయుఁ, దన యూహ సత్యమై తీఱునను నఖండవిశ్వాసమును లేనిచోఁ గొలంబ సాప్రయత్నము నుండి పూర్తిగా విరమించి యుండును. ఆతఁడు స్పెయినుదేశమున ధీమంతులైన పెద్దల సమక్షమునఁ దన సిద్ధాంతమును దేటతెల్లముగా వివరించి వారిద్వారా ఆ దేశపు రాజు ననుగ్రహము సంపాదింప నెంచెను. కాని వా రాతని మాటల విశ్వసింపఁజాలక యాతని ప్రయత్నమును గేలిసేయ మొదలిడిరి. చాలకాలమైన పిమ్మట నట్టి సాహసోద్యోగమున కనువగు కాలమింకను రాలేదని రాజాస్థానమునుండి వార్త వచ్చెను. కొలంబసు మిక్కిలి నిరాశుఁడై తన పరిశీలనమును ఫ్రాంసురాజున కెఱింగింప నిశ్చయించి, యా దేశమునకుఁ బ్రయాణమై యరుగుచుండ, ఇజబెల్లా ఫెర్డినాండు లను స్పెయిను రాజదంపతులు తమ పూర్వాభిప్రాయమును మార్చుకొని యాతని మరలఁ బిలువఁ బంపిరి. వారాతని కెల్లవిధముల సాయమొనరింప నంగీకరించిరి కాని యా యుద్యమమువలనఁ గలుగు లాభమునఁ బదియవ వంతుఁ దన కీయవలెననియుఁ, గ్రొత్తగాఁ గనుఁగొనఁబడు ప్రదేశములకుఁ దన్ను రాజప్రతినిధిగా నియమింపవలెననియు, నాతఁడు కోరఁగనే మరల నించుక వెనుదీసిరి. కొలంబ సంత నా ప్రయత్నమున కగు వ్యయములో నెనిమిదవ వంతు తాను భరించెద నని వారికిఁ దెలియఁబఱిచెను. కాని యప్పుడుకూడ రా జనుమానించుచునే యుండఁ గొలంబసింక లాభములేదని క్రీ. శ. 1492 వ సంవత్సరమున మరల

ఫ్రాంసు దేశమునకుఁ బ్రయాణమాయెను. అంత నాతని మిత్రుల ప్రేరణచే నిజబెల్లా మరల నాతనికై కబురంపి యాతఁడు చెప్పిన నియమము లన్నిటి కంగీకరించుటయే కాక యీ ప్రయాణమున నాతనికిఁ గావలసిన సౌకర్యము లన్నియు నొసంగుటకు వాగ్దాన మొసంగెను.

6. 'శుభస్య శీఘ్రమ్' ని కొలంబసు స్పెయిను తీరమునందలి పాలాసు రేవున వెంటనే బయలుదేరుటకు నిశ్చయించెను. కాని యాతఁ డొనరింపఁబోవు నా యపాయకరమైన ప్రయాణమున నాతని ననుసరించి వెళ్ళుట కెవ్వరును సాహసింపరైరి. ఎట్లో కొంతమందిని బ్రోగుచేసికొని కొలంబసు బయలుదేరునప్పటికి సుమారు నాలుగు నెలలు పట్టెను. శాంటామేరయా, పింటా, నైనా యను పేరులు గల మూఁడు నావలతో వారు ప్రయాణ మారంభించిరి. ఆ మూఁడు నౌకలలోఁ బెద్దదియైన శాంటామేరయాలోఁ గొలంబసును, పింటాలో నలొంజోపెంజానను నతఁడును నాతని సోదరుఁడైన ఫ్రాన్సిస్కోయును, నైనాలో యానెజ్ పింజా నను నాతని మఱియొక సోదరుఁడును గూర్చుండి ప్రస్థానమున కనుమతి యొసంగిరి. శాంటామేరయాలోఁ గొలంబసుతోపాటు పెక్కురు నౌకోద్యోగులుకూడ నుండి యీ ప్రయాణమునకొక విధమైన గరువతనము చేకూర్చిరి. తొంబదిమంది నావికులతోఁ గూడిన మూఁడు చిన్న నౌక లంతకుఁ బూర్వము మానవు లెన్నఁడును బయనించి యెఱుంగని యపారపారావారమునఁ బ్రయాణ మొనరింపనేగుట తీరమునుండి చూచువారందఱికి నెంతయో వింత కలిగించెను.

7. ఒక వారమైనఁ బూర్తిగాఁ గడవకపూర్వమే యీ నౌకలు ప్రయాణమున కనర్హములగుటచే వానిని బాగుచేసి కొనుటకై వారు కానరీదీవులకడ నాగవలసివచ్చెను. వానిని మరలఁ బ్రయాణార్హములఁ గావించుటకు మూఁడు వారములు పట్టెను. తలవని తలంపుగాఁ గలిగిన యీ యాలస్యమునకుఁ గొలంబసెంతయో విచారించెను. అతని యనుచరులలోఁ జాల మంది స్వచ్ఛందముగా వచ్చినవారు కాకపోవుటచే స్పెయిను తీరము దాఁటి నప్పటినుండియు లోలో గొణఁగనారంభించిరి. అయ్యును గొలంబసు నిరుత్సాహమొందక యంతకుఁ బూర్వము నావికులు త్రొక్కిన మార్గములెల్ల వీడి క్రొత్త మార్గమున నజ్ఞాతమహాంభోనిధిలోనికి ధైర్యమున నావలఁ ద్రిప్పించెను. అపరిచితపూర్వమైన యీ ప్రయాణము కొలంబసు ననుచరుల కధికమైన భీతి కలిగించెను. వారు చేయఁబోవు నూతనపరిశోధనలవలన లభించు మణికనకాది సంపద్విస్తరమును గూర్చియుఁ, గీర్తి ప్రతిష్ఠలను గూర్చియు వర్ణించుచుఁ గొలంబసు వారి కుత్సాహము కలిగించుచుండెను. తన యనుచరుల కధైర్యము కలుగకుండుటకై యాతఁడు తన ప్రయాణక్రమమును దెలుపు రెండు పటములు తయారుచేసి, యందు యథార్థమైన దానిని రహస్యముగా నుంచి, స్పెయినింకను సమీపముననే యున్నదని తెలుపు దొంగపటమును దఱుచు వారికిఁ జూపుచుండెను. కానరీద్వీపములనుండి రెండువందలలీగుల దూరమేగిన పిమ్మట దిక్సూచియంత్రము యొక్క సూది యుత్తరమును సూచించుటకు బదులు పడమరగాఁ దిరుగ నారంభించెను. ఇది కొలంబసుకు

మిక్కిలి వింతగా గోచరించెను. కొలంబ సావిషయము తన యనుచరులకుఁ దెలియకుండఁ గొన్ని దినములు రహస్యముగా నుంచెను. కాని క్రమక్రమముగా వారీవిషయము నెఱింగి యనంతమైన యీమహాసాగరమునఁ దమ కించుక మార్గదర్శకమైన యీ యేకైకసాధనముకూడఁ బాడైపోయినందున ధైర్యమును గోల్పోయి యింక నాపద తప్పదని తలంచిరి. కొలంబ నది యట్లుండుట కేవో కారణములు చెప్పి వారికి ధైర్యముఁ గొల్పుటలోఁ గృతార్థుఁడాయెను.

8. సెప్టెంబరు 14 వ తేదీని గొలంబసు కాంచుచుండిన స్వప్నము నిక్కమగుననుటకుఁ గొన్ని చిన్నెలు కానిపించెను. భూతలమునుండి చాలదూరము రాఁజాలని రెండు పక్షులు నౌకలపైఁ దిరుగాడఁ జొచ్చెను. దానికిఁదోడు పర్వతప్రాంతములందును నదీతీరములందును మొలచు కొన్ని మొక్కలు సముద్రములోఁ గొట్టుకొని వచ్చుచుండెను. వాతావరణ పరిస్థితి కూడ భూసామీప్యమును సూచించుచుండెను. భూమి చేరువగా నుండెననుతలంపు నావికులనందఱ మహానందమగ్నులఁ గావించెను. మొట్టమొదట భూమి జాడలు పొడగన్నవారికి రాజదంపతు లీయ వాగ్దానము చేసిన పారితోషికము నందు కోరికతో నందఱు నౌకోపరిభాగముల కరుదెంచి పక్షు లెగిరివచ్చుచున్న దెసకుఁ జూడసాగిరి. కాని సుమారు వారము రోజులవఱకును నౌకలు భూభాగమును జేరఁజాలమిచే నావికులు మరల నిరుత్సాహపూరితులై వెనుకకుఁ దిరిగి పోదమని కొలంబసును కెఱింగించిరి. కొలంబసందుల కంగీకరింపమిచే / వారు చేయునది లేక, యాతనిని సముద్రములోనికి

గెంటి, తాము స్వదేశమునకుఁ దిరిగి పో సంకల్పించిరి. కొలంబసు రాజశాసనముచేతనే తానాప్రయాణమును సాగించుచుండెననియుఁ, దద్విరుద్ధముగా వర్తించువారు రాజశాసనమునకు విరుద్ధముగా సంచరించిన వారగుదురనియు, నావికులను మందలించి, పట్టువిడక పయనము కొనసాగించెను. అదృష్టవశమున నీమాఱు భూసామీప్యమును దెల్పు మఱికొన్ని నిశ్చితచిహ్నములు కానిపించెను. భూమిపై మొలచు మొక్కలకుఁ దోఁచు సఫలమై యచిరకాలము క్రిందనే చెట్టునుండి విడివడిన యొక కొమ్మయు, నక్షీపనితోఁ గూడిన యొక స్తంభభాగమును సముద్రజలమునఁ దేలుచు వారిహృదయక్షేత్రముల ధైర్యాంకురముల రేకెత్తించెను. అసంతృప్తియంతయు విధేయతగా మాఱెను. భూమిజాడ గోచరించునేమో యను తలంపుతో వారు మరల నఱులెత్తి చూడసాగిరి. ఓడలు పయనించుచున్నచో రాత్రిసమయమున నా భూభాగమెచ్చట దాఁటి పోవునోయని కొలంబసు చీఁకటి పడఁగనే యోడలకు లంగరు వేయించెను. ఆరాత్రి యెవ్వరును గన్నులు మూయలేదు. చిట్టచివరికి వారి యాశ ఫలించెను. కొలంబసు దూరముగాఁ గదలుచున్న యొక దీపమును గాంచి దానిని దన మిత్రుని కొకనికిఁ జూపెను. నావికు లందఱును గూడ దానిని జూచిరి కాని యది కేవలభ్రాంతి యని త్రోసిపుచ్చిరి. తెల్లవారుజామున నొక నావికుఁ డదిగో భూమి యని సంతోషపూరితహృదయుఁడై కేక వైచెను. తెల్లవారిన పిమ్మట నావికు లందఱికిని గొంత దూరమున వృక్షాచ్ఛాదితమైన యొక ద్వీపము స్పష్టముగాఁ గానవచ్చెను.

అప్పుడు నావికు లొందిన యానందమునకు మేర లేదు. తా
నెన్ని సంవత్సరముల నుండియో ప్రోది యొనర్చి పెంపొం
దించుచున్న యాశాలత ఫలోన్ముఖ మయ్యెఁగదా యని
కొలంబసు మహానందమున క్షణకాలము మేను మఱచెను.
భూభాగము దృగ్గోచరము కాఁగానే కొలంబసు కష్టము
లన్నియు గట్టెక్కెను. నావికు లందఱును దమ యవిధేయ
తకు క్షమింపవలెనని యాతనిఁ బ్రార్థించిరి. పిమ్మట సురక్షి
తముగాఁ దమ్మా ద్వీపమును జేర్చిన భగవానుని యమేయ
దయావిశేషము నగ్గించుచు వారు భక్తిపరవశులై కేలుఁదమ్ము
లు మోడ్చిరి.

9. క్రీ. శ. 1492 వ సంవత్సర మక్టోబరు 12 వ తేదీని
రాజప్రతినిధి ధరింపవలసిన యధికారవేషము ధరించి, వలకేల
స్పెయిను దేశ పతాకమలరారఁ గొలంబసు తాను గ్రొత్తగా
గనుఁగొనిన యా ద్వీపమున మొట్టమొదటఁ గాలు మోపెను.
దిగిన వెంటనే యాఁతడు నేలపై మోఁకరిల్లి, భూమి నాఘ్రా
ణించుచు ధ్వజారోపణోత్సవముఁ గావించెను. పిమ్మట
నాతఁడా ద్వీపము స్పెయిను సామ్రాజ్యము నందలి యొక
భాగమయ్యె నని ప్రకటించెను. అందలి ప్రజలా ద్వీపము పేరు
గౌణహాని యని కొలంబసున కెఱింగించిరి. కొలంబసు దానికి
శాన్‌సాల్వదారను నూతన నామ మొసంగెను. అది యిప్ప
టికి నా నామముతోడనే మెక్సికోసింధుశాఖ ముఖద్వారమున
నున్న బహామాద్వీపసంఘములో నొక్కటియై యున్నది.

10. ద్వీపనివాసు లంతకుఁబూర్వ మట్టి నౌకల నెన్నఁ
డును జూచియుండని కారణమున వాని నాశ్చర్యముతోఁ

దిలకించుచుఁ దెల్లని శరీరములు గల యీ విదేశీయుల నారసి నంతనే భయకంపితులై పరువిడఁజొచ్చిరి. కాని వారు తమ్ము వెంటనంటుటకుఁ బ్రయత్నింపమిచేఁ గొంత భయము వీడి తిరిగివచ్చి వా రొనరించిన ద్వీపాక్రమణమహోత్సవము నది యేమియో తెలియకుండనే యానందమునఁ బరికించిరి. ఆ ద్వీపము హిందూదేశమునకు (ఇండియా) సమీపముననే యుండెనని కొలంబసు పూర్తిగా విశ్వసించియుండుటచే నందలి దేశీయుల కిండియనులని పేరిడెను. అప్పటినుండియు నాత్మప్రపంచవాసుల కా పేరు రూఢమై చెల్లుచునేయున్నది. ఆ సమీపమునందే తాఁ గనుఁగొనఁబోవు ద్వీపము లన్నిటిని గలపి కొలంబసు పడమటి యిండియా దీవులని పేర్కొనెను. తా నిండియాకు సమీపముననే యుండెనని కొలంబ సెంత గాఢముగా విశ్వసించెనో యీ నామము చెప్పక చెప్పుచున్నది. స్పెయినుదేశస్థులు కొలఁదికాలములోనే యిండియనులతోఁ జెలిమి కావించుకొనిరి. ఇండియనులు వా రిచ్చు నాటవస్తువులు, అలంకారములు మున్నగువానికొఱకు బలాటపడుచుండ స్పెయినువారు దేశీయులు ధరించిన స్వర్ణాభరణములఁ గాంచినప్పటినుండియు నమూల్యమైన యా లోహము జాడ లెచ్చట నుండునా యని మిక్కిలి యాత్రముతోఁ బరిశీలింప మొదలిడిరి. వా రా లోహము నునికినిగూర్చి యడిగిన ప్రశ్నల కిండియను లది యచ్చటికి దక్షిణదిశగానున్న దేశమున విస్తారముగా లభించునని చేసైగలచే సూచించుచుండిరి. కొలంబ సంత నా దేశమున కేగక యాలసింపనేలయని తనకు మార్గ

దర్శకులుగా నుండుట కేడుగురు దేశీయులనుగూడఁ దీసికొ
వెంటనే దక్షిణముగాఁ బ్రయాణము సాగించెను.

11. ఇండియనులు చూపిన దారి ననుసరించి పయః
చుచుఁ గొలంబసు పెక్కు చిన్న ద్వీపములను గాంచెన
దేశీయు లొసంగిన వాని వర్ణనాదికమునుబట్టి యాతఁ డ
మార్కో-పోలో యను వెనీసువర్తకుఁడు వర్ణియించియుండి
చైనా సమీపమునందలి ద్వీపములని నిశ్చయించుకొనెన
అతఁడు పెక్కుద్వీపములలో దిగి బంగారమునకై తీవ్రమై
యన్వేషణము కావించెను. కాని యా లోహము జాడ లెచ
టను గానరాలేదు. ఆ యా ద్వీపములందుండువా రది యింక
దక్షిణముగానున్న దేశమున విరివిగా లభించునని సూచిం
నారంభింప స్పెయిను నావికులు మనస్సులలో నించుక ని
త్సాహ మొందసాగిరి. చిట్టచివరి కిండియనులు కొలంబసు
క్యూబాద్వీపమునకుఁ గొనిపోయిరి. నామసామ్యమునుబ
కొలంబసది మణిసువర్ణములకు మిక్కిలి ప్రఖ్యాతివడసి
సిపంగో (జపాను) ద్వీపమని నిర్ణయించి యక్టోబరు మాస
తమున నందుఁ బ్రవేశించి స్పెయినుదేశపురాజు పేరుతో దా
నాక్రమించుకొనెను.

12. క్యూబాద్వీపమునందలి సౌందర్యవిభవము
జూచిన కొలంది నది సిపంగోయేయను కొలంబసు నభిప
యము మఱింత దృఢపడెను. ఆనమ్మకముతోడనే యా
డందు దిగి బంగారు జాడలకై తీవ్రముగాఁ దత్తీరమున న
షింప నారంభించెను. మొట్టమొదట నచ్చటివారు వా
గాంచినంతనే భయమునఁ బాఱిపోఁ దొడంగిరి. కాని య

యాగంతుకులు తమకెట్టి హానియు నొనరింపరని తెలిసిన పిమ్మటఁ దిరిగివచ్చి వారితో స్నేహభావముతో మెలంగ నారంభించిరి. వారు తాము నివసించు ద్వీపము క్యూబా యని కొలంబసున కెఱింగించిరి. కాని కొలంబసు వారి భాష నుగాని సైఁగలనుగాని పూర్తిగా నర్థముచేసికొనలేని కారణ మున నది యాసియా ఖండమునందలి భాగమేయని విశ్వసిం చుచు దాని యాంతరభాగమంతయు నన్వేషించెను. పిమ్మట గొంతకాలమున కట్టి యన్వేషణమువలన నెట్టి లాభమును లేదని గ్రహించి యాతఁడింకను గొత్త ద్వీపములఁ గనుఁ గొనుటకై తూర్పుగాఁ బ్రయాణము సాగించెను. సముద్రము సంక్షుభితమై యుండుటచే నాతఁడొక నౌకాశ్రయమున నోడల నాప నాజ్ఞాపించి దానికి ప్యూర్టోడెల్‌ప్రిన్సిపే యను నామ ధేయ మొసంగెను. ఇచ్చట నాలంజోమార్టిను పింజాను తన నాయకత్వమున నుండిన పింటాయనునోడతోఁ గొలంబసు సంఘమువారిని వీడి యేగెను. కొలంబ సాతని కొఱకుఁ గొంతకాలము వ్యర్థముగాఁ నచ్చట నాగి, యాతఁడు స్వతం త్రముగాఁ బయనింపనెంచెను గాఁబోలునని యూహించి, తాను మరలఁ బ్రయాణము సాగించుచు, డిసెంబరు 6 వ తేదీ నొక సుందరమైన మహాద్వీపమును గాంచెను. నావికు లందఱు నా ద్వీపమునఁ దిగి తీరభాగములఁ గొంతకాలము సంచరించిరి. కొలంబసు దానికిని స్పెయినునకును నాకార మునఁ జాలసాదృశ్యము కలదని యెంచుటచే దానికి హిస్పాని యోలా యని పేరిడెను. పూర్వమువలెనే యాతఁడా ద్వీప మును స్పెయిను రాజుపేర నాక్రమించి యా యాక్రమణ

మహోత్సవము నతివైభవముతో జరిపెను. దేశీయులు వారిని స్నేహభావముతో నాదరించుటయేకాక వారొసంగు నాట వస్తువులకు బదులుగాఁ దమకడనున్న సువర్ణాభరణములను సైతమీయఁ దొడంగిరి. ఈవస్తువినిమయము నావికులందఱి కిని గడుంగడుఁ బ్రీతికరమై యొప్పారెను. వారా ద్వీపముం తయుఁ దిరిగి యందలి సంపద్వైభవముల కంతయు సంతసించిరి.

13. ఇచ్చటఁ గొలంబసు నొక శాంటామేరయా నేలకుఁ దగిలి భగ్నమయ్యెను. కొలంబసు దేశీయుల సహాయముచే నందలి వస్తువులన్నియు నైనా యను నోడలోనికి మార్పించెను. తనప్రయాణ మింకను ముగియకమున్నె యోడ భగ్నమై పోయినందులకుఁ గొలంబసు మిక్కిలి విచారించెను. కాని యాద్వీపములో బంగారు మధికముగా దొరకునను వార్త యాతని యా విచారమును జాలవఱకుఁ దగ్గించెను. తాను గనుఁ గొన్న ద్వీపములవిషయమై రాజదంపతులకు నివేదించు నిమిత్త మీసమయమునఁ గొలంబసు మాతృదేశమునకు వెళ్ళఁ దలంచెను. కాని యచ్చట విస్తారమైన సువర్ణము లభించుననుటకుఁ జాల చిహ్నములు కానిపించుటచే నాతఁడు కొందఱు నావికుల నొక వలసరాజ్యము నెలకొల్పుటకై యటవిడిచి, వారిరక్షణకై యటనొక చిన్న దుర్గము నిర్మించి క్రీ. శ. 1493 వ సంవత్సరము జనవరి 4వ తేదీని నైనాపై బయలుదేఱెను. ఆతఁడా ద్వీపమునకుఁ దూర్పుగాఁ బయనించు చుండఁ గొన్నిరోజులకు పింటా యాతనికిఁ గానిపించెను. ధనసంపన్నము లైన కొత్త ద్వీపములను గొలంబసు కంటె ముందుగాఁ దానే కనుఁగొనవలెనను నాశయే పింజాను

కొలంబసు సంఘమువారిని విడిచి పోవుటకుఁ గారణమని తెలియవచ్చెను. కొలంబసు ప్రజ్వలించిన కోపాగ్ని నెట్లో యడంచుకొని పింటాతోఁ గలసి మాతృదేశమునకుఁ బ్రయాణము సాగించెను. కాని వెంటనే యొక పెద్ద తుపాను వీచుటచే మరల నా రెండు నౌకలును నొండొంటికిఁ గనఁబడకుండఁ జెదరిపోయెను. మఱునాఁడా తుపాను చల్లారిన వెనుక నా రెండోడలును గలసికొని ఫిబ్రవరి 17 వ తేదీనాఁటికి సెంటు మేరీద్వీపము కడకరుదెంచెను. ఇచ్చటఁ గొలంబసోడను బాగు చేయించి దానిని జలాహారములతో నింపెను. ఈద్వీపము పోర్చుగీసు వారికిఁ జెందియుండుటచే వారసూయాగ్రస్తులై కొలంబసుకుఁ గొంత కష్టము కలిగింప నెంచిరి. కాని కొలంబసు వారి ప్రయత్నము కొనసాగనీయక ఫిబ్రవరి 24వ తేదీ నాద్వీపము దాఁటెను. మరల నొక పెద్దతుపాను సంభవించుటచే నాతని యోడ టాగసు నదీముఖద్వారము నొద్దకుఁ గొట్టుకొనిపోయెను. కొలంబసు నూత్నప్రదేశమును గనుఁగొనెనన్న వార్త తొలుఁదొల్త నెఱింగినవారు పోర్చుగీసువారే. మొట్టమొదటఁ గొలంబసు వచ్చి యడిగినప్పుడు తమదేశపు రాజాతనికి సాయముచేయ నంగీకరించియుండినచో నాప్రదేశములును సంపదయుఁ దమ దేశమునకే దక్కి యుండును గదాయని పోర్చుగీసువారు చింతించిరి. రాజానుమతిచేఁ గొలంబసు లిజ్బనులో దిగెను. కొలంబసువలన స్వయముగా నాతని ప్రయాణవృత్తాంతము విననెంచి రాజాతని నాస్థానమునకుఁ బిలిపించి దర్శన మొసంగెను. అసూయాతిరేకముచే రాజపురుషులు కొందఱు కొలంబసును జంపించుట యుక్తమని

రాజున కెఱింగించిరి. కాని రా జట్లుచేయనొల్లక కొలంబసును శాంతముగాఁ బంపివైచెను. కొలంబసు మార్చి 15వ తేదీ నాఁటికి బాలాసు నగరము చేరెను. స్పెయిను దేశీయులాతని కమితానందమున స్వాగత మొసంగిరి. మొట్టమొదట నాతని ప్రయత్నమున కడ్డు తగిలినవారే యిప్పుడాతనిఁ బలువిధ ముల నగ్గింప నారంభించిరి. కొలంబసు మున్నగు నావికులం దఱును జనసమూహములచే ననుగమ్యమానులై, దేవాలయ ములకేగి, తమ్ము సురక్షితముగా మరల మాతృదేశముఁ జేర్చి నందులకు భగవంతునికిఁ గృతజ్ఞతాపూర్వకములైన నమస్కృ తులొనరించిరి.

**14.** కొలంబసు బార్సిలోనాలోనున్న రాజదంపతు లకుఁ దన రాక నెఱింగించుచు నొక లేఖ వ్రాసెను. వారు వెంటనే యాతని నాస్థానమునకుఁ బిలిపించి యఖండమైన స్వాగత మొసంగిరి. కొలంబసాస్థానము చొచ్చినంతనే రాజ దంపతులు గౌరవసూచకముగా సింహాసనములనుండి లేచి యాతనిఁ బ్రయాణవృత్తాంత మంతయు వివరింపుమని కోరిరి. కొలంబసు పూసగ్రుచ్చిన విధమునఁ దన ప్రయాణమును గూర్చియుఁ బరిశోధనలఁ గూర్చియుఁ దత్ఫలితములఁ గూర్చియు వర్ణించుచుండ వారమితమైన యుత్సాహమున నాలకించి యాతని కమూల్యములైన బహుమానము లొసంగిరి. కొలం బసు తనతోఁగూడఁ దెచ్చిన కొంతమంది దేశీయులను, గొన్ని సువర్ణాభరణములనురాజదంపతులకుఁ జూపి వారి యానందము నినుమడింపఁజేసెను. ప్రజలు జయజయధ్వనులతోఁ గొలంబసు నూరేగించి యాతని నొక దేవునివలెఁ బూజించిరి. జ్ఞాతె

పూర్వమైన హిందూదేశమునకు మార్గము కనుఁగొనవలెనను నుద్దేశముతోఁ గొలంబసు గావించిన ప్రయాణమి ట్లజ్ఞాతపూర్వమైన యొక క్రొత్తప్రపంచముఁ గనుఁగొనుటకుఁ దోడ్పడెను. కొలంబసే కాక యాతనిసమకాలికులు పలువురాతఁడు కనుఁగొన్న యా ద్వీపము లాసియా ఖండమునకుఁ బరిసరప్రాంతము నందున్నవే యని దృఢముగా విశ్వసించియుండిరి !

15. కొలంబసు ప్రకటించిన యూహలు వట్టి స్వప్నములు కాక యథార్థములే యని యిప్పుడు తెలియవచ్చుటచే స్పెయిను రాజైన ఫెర్డినాం డాతని నుత్సాహముతోఁ బ్రోత్సహింపఁ దలంచుటయే కాక క్రీ. శ. 1493 వ సంవత్సరమున నాతని రెండవసారి సముద్రయానమునకుఁ బంప సమకట్టెను. అసూయాగ్రస్తుఁడైన పోర్చుగలు రాజు తా నజ్ఞానముచే నిదివఱకుఁ గొలంబసు మాటలు పెడచెవిని బెట్టి కోల్పోయిన లాభమంతయుఁ గూడఁదీసికొనుటకై యాతనికి సందేశములు పంప నారంభించుటచే స్పెయిను రాజదంపతులు కొలంబసును వెంటనే బయలుదేఱుటకుఁ దొందరపెట్టిరి. రాజదంపతుల యుత్సాహ మెట్లున్నను గొలంబసు తానుగూడ మరల సముద్రములపైఁ బోవుటకు మిక్కిలి కుతూహలపడుచుండుటచేఁ బ్రయాణమునకు వెంటనే సిద్ధుఁడయ్యెను.

16. కొలంబసు మొదటి పైనమునకును ఈ రెండవ ప్రయాణమునకును జాల వ్యత్యాసము కలదు. అప్పుడాతఁడు మనస్సునఁ బ్రయాణమన్న నిష్టము లేని కొలఁదిమంది నావికులతో మూఁడు చిన్న నౌకలపై బయలుదేఱెను. ఇప్పుడాతఁడు వివిధకర్మకుశలులైన పరివారజనులతో, నూతన ద్వీపములలో

నివసించుటకుఁ దగిన పరికరములతో, సమృద్ధము లైన యాహారపదార్థములతోఁ బదునేడు నావలపైఁ బ్రయాణము సాగించెను. మొదటఁ గొలంబసు తనతో వచ్చుటకు విముఖులై యున్న జనులను బలువురిని బ్రతిమాలవలసి వచ్చెను. ఇప్పుడు కొలంబసును, నాతనితోఁ దిరిగివచ్చిన నావికులును గ్రొత్త ద్వీపములను గుఱించియు నందలి వైభవసమృద్ధిని గూర్చియుఁ జెప్పిన యతిశయోక్తులచే నాకృష్టులై పలువురు సామాన్యులే గాక కులీనులు కూడఁ దమ్మాతనితో రానిచ్చుటకై వేఁడుకొనఁ జొచ్చిరి. అందుచేఁ గావలసినంతమందిని సమకూర్చుకొనుటలోఁ గొలంబ సీమా ఱిసుమంతయుఁ గష్టపడ నక్కఱ లేకపోయెను. క్రీ. శ. 1493 వ సంవత్సరము సెప్టెంబరు 25 వ తేదీ నాతఁడు పలువురు బంధుమిత్రాదులు తీరము నుండి యాత్రముతోఁ జూచుచుండ కాడిజు రేవునుండి ప్రయాణము సాగించెను.

17. కొలంబ సీసారి పూర్వపుమార్గమునే యనుసరింపక నూతనద్వీపము లందలి యిండియనులు తమ కింకను దక్షిణముగానున్నవని చెప్పిన హేమద్వీపములను గనుఁగొనవలెనను నుద్దేశముతో నౌకలను దక్షిణాభిముఖముగాఁ బోనిచ్చెను. పదునైదు దినములు పయనించిన పిమ్మటఁ గొలంబసునకు భూసామీప్యమును సూచించు కొన్ని జాడలు కానిపించెను. సముద్రముయొక్క రంగును, దరంగముల యొక్కయు గాలియొక్కయుఁ దీరును, సునిశితములైన యాతని నేత్రములకు భూమి సమీపముగనే యుండెనని స్పష్టముగా నెఱింగించెను. అందుచే నాతఁడు నౌకలను దీర

మునకు సమీపముగా నిల్పి రాత్రివేళ భూభాగము దాఁటి పోకుండఁ జూడుఁడని నావికుల కాజ్ఞాపించెను. తెల్లవాఱిన పిమ్మట వారి కచ్చటికిఁ జెంతనే యొక ద్వీపము కానిపించెను. కొలంబసు దానికి డొమినికాయని పేరిడెను. సూర్యోదయ మగునప్పటికి మఱికొన్ని ద్వీపములు నావికులకు దృగ్గోచరము లయ్యెను. వారి యానంద మింతింత యని వర్ణింప నలవికాదు. దక్షిణఅమెరికా కుత్తరతీరముననున్న యీ ద్వీపముల కిప్పుడు లెస్సరు యాన్టిల్లీసని పేరు.

18. డొమినికా ద్వీపమునందలి తీరము నౌకలు నిల్పుట కనుకూలముగా లేని కారణమునఁ గొలంబసు మేరిగలాంటీయని తాను బేరిడిన యొక ద్వీపమును దాఁటి, గాడలోపను ద్వీపమును జేరి, యచ్చట నోడలకు లంగరు వేయించెను. అచ్చట నాతఁడు ద్వీపాక్రమణోత్సవము నతివైభవముతో జరిపి యనుచరులతో నందలి యొక గ్రామమును జూడ నేగెను. అచ్చటి ప్రజలు వారిని జూచినంతనే యతిభీతులై తమ బిడ్డలనుగూడ వీడి పరుగెత్తిరి. నావికులా పిల్లల కాటవస్తువులు మున్నగువాని నొసంగి యుపలాలించుచుండఁ బాఱిపోయినవారు దిరిగి వచ్చి వారివలనఁ దమకెట్టి హానియు జరుగదని యెఱింగి క్రమక్రమముగా వారితో స్నేహమున మెలంగఁ జొచ్చిరి. ఆగ్రామమునందలి పురుషు లుపయోగించు ధనుర్బాణములును, అచ్చటఁ విరివిగాఁ బండు ననాసఫలములును నావికులకు మిక్కిలి వేడుక చేకూర్చెను. కాని యొకచోట మానవుల యస్థికపాలములు కానవచ్చుటచే నచ్చటివారు నరభక్షకులేమోయని వారించుక

భీతిచెందిరి. తరువాతఁ దెలియవచ్చిన కొన్ని విషయములు వారి యనుమానమును బలపఱిచెను. దానికిఁదోడు డియగో మార్క్వె యనునాతఁడు మఱికొందఱు మిత్రులతోఁ గొలంబసు ననుమతి లేకుండనే ద్వీపములోని కరిగి సాయంకాలమునకుఁ దిరిగి రాఁజాలకపోయెను. మఱు నాఁటి ప్రాతఃకాలముననైన వారురాకుండుటచేఁ గొలంబసు వారా నరభక్షకుల బారి పడిరేమోయని వంతచెందుచు వారి నన్వేషించుటకై పలువుర నన్నిదెసల కును బంపెను. కాని వారందఱును దప్పిపోయినవారి జాడ లెఱుంగకుండఁగనే వ్యర్థముగాఁ దిరిగివచ్చిరి. వారి నచ్చట విడిచి యేగుట యెట్లాయని కొలంబసు విచారించుచుండ ఆలొంజోడి ఒజడాయను యువకుఁ డొకఁడు తన్మార్గణమునకై ద్వీప మంతయుఁ దిరిగివచ్చుటకు సాహసించెను. ఆతఁడు నలువది మంది నావికులతో నా ద్వీపమునందలి సాంద్రారణ్యము లన్నియు నన్వేషించెను. కాని మార్క్వెసంఘమువారి జాడ లేమియు నాతనికిఁ గానిపింపలేదు. ఆతఁడు తిరిగివచ్చునంతలోఁ గొలంబసు నౌకలను జలాహారములతో నింపి ప్రయాణము నకు సిద్ధము గావించెను. తప్పిపోయినవారిని వెదకుటకై చేయ వలసిన ప్రయత్నములన్నియుఁ జేసినపిమ్మట నింక లాభము లేదని కొలంబసు హిస్పానియోలాకు బయలుదేఱెను. సరిగా నోడలు కదలుసమయమునకు మార్క్వెయుఁ దన్మిత్రులును దీరమున కరుదెంచి వెడలుచున్న యోడలకుఁ గొన్ని సైఁగలు చేసిరి. పరమానందభరితుఁడై కొలంబసు వారి నోడలకడకు రప్పించి, వా రా ద్వీపమునందలి యరణ్యములలో దారి

తప్పిరనియు, మిన్నంటు పెనువృక్షజాలములు వారికి నక్షత్రి దర్శనముకూడ లేకుండఁజేసెననియు నెఱింగి, వారి నచ్చట నిర్దయముగా విడిచి వెళ్ళిపోయెనను నింద తనకుఁ దొలఁగెను గదాయని యూఱడిల్లెను.

19. పిమ్మటఁ గొలంబసు పైనము సాగించి నవంబరు 14 వ తేదీని శాంటాక్రుజను ద్వీపమును జేరెను. అచ్చట నాతఁడు సహచరులతో దిగి కొందఱు స్త్రీలను బాలకులను బట్టుకొనెను. అందుచే నా జాతికిఁజెందినవారికిని నావికులకును గొప్ప పోరాటము జరిగెను. దేశీయులు సాహసముతోఁ బోరాడియుఁ జివరికి స్పెయినువారికి వశులైపోయిరి. అచ్చటనుండి బయలుదేఱి కొలంబసు మఱికొన్ని యితర ద్వీపములనుగూడఁ గనుఁగొని హిస్పానియోలా కభిముఖముగా నౌకలనుద్రిప్పెను. హిస్పానియోలా సమీపించుచున్నకొలంది నావికుల యానం దోత్సాహములు చెలరేఁగెను. కాని వా రచ్చట దిగినంతనే తీర మున దేశీయుల కళేబరములతోపాటు కొన్ని స్పెయిను వారి కళేబరములు కూడఁ గానిపించుటచే వారియా నందమంతయు శంకాకళంకితమయ్యెను. 25 వ తేదీ సాయంకా లము లానవిడాడుచేరి నావికులొక తుపాకిప్రేల్చి సైగ కావిం చిరి. కాని దానికిఁబ్రత్యుత్తరమేదియు రాకపోవుటచేఁ గొలంబసు భయము మఱింత యధికమయ్యెను. ఆ దీర్ఘమైనరాత్రి యెట్లో గడపి ప్రాతఃకాలమునఁ గొలంబసు నావికులతో ద్వీపమునఁ బ్రవేశించెను. అచ్చటచ్చటఁ జెట్లచాటున దాగియుండిన కొంద ఱిండియనులు తక్కవారి కక్కడ స్పెయినుదేశీయుఁ డొక్కఁడును గానరాఁడాయెను. కొలంబసు స్పెయిను వెళ్లుటకు

ముందచ్చట నిర్మించిన దుర్గము దగ్ధపటలమై యుండెను. వారి కప్పుడు మిత్రుడుగా వర్తించిన దేశీయనాయకుని గ్రామము కూడ శిథిలితమై రూపఱియుండెను. తానుదిరిగి వచ్చుసరికిఁ దనవారు కూర్చియుంతురని కొలంబసనుకొనిన బంగారు రాసులకు బదులాతని కచ్చటచ్చటఁ దనవారు భూస్థాపితులైన తావులను సూచించు మట్టిదిబ్బలు మాత్రము కానిపించెను. స్పెయిను వారికచ్చటఁ జేకూరిన యీసంఘమరణమునకుఁ జాలవఱకు వారే కారణభూతులనియు, వారి దుస్థితివర్తనమును, వాణిజ్యవంచనయు, దురాశయు నాగ్రహము పెంపఁ బరిసరప్రాంతముననున్న దేశీయనాయకుఁడొకఁడు హఠాత్తుగా వారిపైఁబడి దుర్గమును నిర్మూలించి, తన్నివాసులఁ జంపించెననియుఁ దరువాతఁ గొలంబసునకుఁ దెలియవచ్చెను. ఈదారుణవార్త కొలంబసుతో నరుదెంచిన నావికులందఱికి నపార విచారము కలిగించెను. వారు నివాసయోగ్యమైన మఱొక ద్వీపమునకేగుట మంచిదని కొలంబసుకు సూచించిరి.

20. తన దేశమువారు పలువురావిధముగా ఘోర మరణముపాలైరని యెఱింగియుఁ గొలంబసు నిరుత్సాహపడక మరల నొకపట్టణము నిర్మించి, బంగారముకొఱకు వెదుక నిశ్చయించెను. అందుచే నాతఁడు సహచరులతోఁగూడ ద్వీపము లోపలిభాగమునకరిగి యచ్చట నొక ప్రదేశము నివాసయోగ్యముగా నుండునని నిశ్చయించి యొక దుర్గమునేకాక పట్టణమునుగూడ నట నిర్మింపఁదలంచెను. ఆపట్టణమున కాతఁడు స్పెయినుదేశపు రాణియైన ఇజబెల్లా గౌరవార్థ మిజబెల్లాయని పేరిడి, ఆలొంజోడి ఒజడాను బంగారు గనులున్న తావులు

పరిశీలించుటకై ద్వీపమునందలి యాంతరభాగమునకుఁ బంపెను. ఒజడా మఱికొందఱు మిత్రులతో బయలుదేఱి యొక గ్రామముచెంత బంగారమున్న చిన్నెలు విశేషముగాఁ గానిపింప మిక్కిలి సంతోషించి తిరిగి వచ్చి కొలంబసున కావార్త యెఱింగించెను. కొలంబసంత హిస్పానియోలా సహజసంపదను గూర్చియుఁ దానింకను గనుఁగొనఁబోవు నితర ద్వీపములను గూర్చియు స్పెయిను రాజదంపతుల కొక నివేదిక పంపి, తాను స్వయముగా నేగి ఒజడా చూపిన ప్రదేశమును సందర్శించెను. అచ్చటి పరిస్థితులతో నాతఁడు కడుంగడుఁ దృప్తుఁడై యటనొక దుర్గమును గట్టించి కొంతకాలమైన పిమ్మట నిజబెల్లా నగరమున కరుదెంచెను.

21. క్యూబా కేవలమొక ద్వీపమా లేక యాసియా ఖండమునందలి యొక భాగమా యను సందేహమింకను దన్ను బాధించుచుండుటచే దానిని దీర్చుకొనుటకై కొలంబసు నావలపై మరలఁ బ్రయాణము సాగించెను. దేశీయులచ్చటికి దక్షిణముగా నున్న యొక ద్వీపమున బంగారము విరివిగా నుండెనని చెప్పుటచేఁ గొలంబసు వారు చెప్పిన మార్గము ననుసరించి యోడలను బోనిచ్చెను. కొలఁది రోజులు ప్రయాణముచేసిన పిమ్మట వారికి జమైకా ద్వీపము గోచరించెను. కొలంబసు దానికి శాంటియాగో యను నామధేయ మొసంగెను. అచ్చటి యిండియనులు సుహృద్భావముతో వారి నాదరించిరి. కాని బంగారు జాడలుమాత్రము మెచ్చటను గోచరింపలేదు. అంతఁ గొలంబసు క్యూబా తప్పక యాసియా ఖండమునందలి యొక భాగమై యుండునని తన తలంపు

స్థిరపఱుచుకొనుటకై యా ద్వీపమునకుఁ బయనమయ్యెను. అచ్చట దిగి యాతఁడు తన సహచరులతో నందలి కొంత భాగమును బరిశీలించెను. భూభాగ మింకను దక్షిణముగాఁ గొనసాగినట్లు కానిపించుటచే వారందఱు నది యాసియా ఖండభాగమనియే నిశ్చయించిరి. అచ్చటనుండి వారింకఁ గొంచెముదూర మరిగియుండినచో వారి భ్రాంతి పటాపంచలై యుండెడిది. కాని సంపదలకాకరమైన యాసియాఖండమును గనుఁగొంటి నను దృఢనిశ్చయముతోఁ గొలంబసు మరణింప వలెనని దైవము సంకల్పించియుండ నదియెట్లు జరుగును? ఆ విశ్వాసముతోడనే కొలంబసు మరల హిస్పానియోలాకుఁ దిరిగివచ్చెను. దారిలోఁ దుపానుబాధవలనఁ గలిగిన యలజడి చేతను, సహచరులయందుఁ గలిగిన నిరుత్సాహముచేతను గొలంబ సచ్చటికి వచ్చుసరికి చిక్కి శల్యమై మిక్కిలి బలహీన స్థితిలో నుండెను,

22. ఇజబెల్లా చేరఁగనే యచ్చటి పరిస్థితులు మిక్కిలి విరుద్ధముగా నుండెనని కొలంబసు గ్రహించెను. అచ్చటఁ గొలంబసుచే నధికారిగా నియమింపఁబడిన పెడ్రో మార్గరెటను నాతఁడు దేశీయులతో మైత్రి చేసికొనుటకు బదులు వారి నవమానించుటచేతను, దన దుష్ప్రవర్తనాదుల చేతను బలువురు దేశీయనాయకులకు విరోధియాయెను. ఇది యెఱింగి కొలంబ సాతనియెడ మిక్కిలి కఠినముగా వర్తించెను. అంత నాతఁడు విముఖుఁడై యపరక్తులైన యితరోద్యోగులఁ గొందఱఁ గైకొని రాజదంపతులకుఁ గొలంబసు క్రౌర్యమును గూర్చి మనవిచేసికొనుటకై స్పెయినుదేశమునకు వెడలి

పోయెను. తా నట్టి క్రౌర్యము నెన్నఁడును జూపియుండమిచేఁ గొలంబసు భయపడక, పాలనవిధానమంతయు స్వహస్తగతము చేసికొని, శతృవులైన దేశీయనాయకుల శాంతింపఁ జేయుటకును, వా రందుల కొడంబడనిచో నిరోధించుటకును ఒజడాను బంపెను. ఒజడా యొక్క పన్నాగముపన్ని దేశీయ నాయకు లందఱిలో బలవంతుఁడైనవానిని నిర్బంధింపఁజాలెను. తళతళ మెఱయు హస్తనిగళముల నాతనికిఁ జూపి యాతఁడు స్పెయినులో వానిని ధరించుట గొప్ప గౌరవమునకు సూచన యని యెఱింగింప నా నాయకుఁడు వాని కృత్రిమకాంతిచే మోహితుఁడై వానిని దన చేతులకుఁగట్ట నంగీకరించెను. ఈ విధముగా నాతఁడు బందీకృతుఁడై ఒజడాకు లొంగి పోయెను. క్రమక్రమముగా నా ద్వీపమంతయు స్పెయిను వారికి వశమయ్యెను. నాయకులు బంగారము, ప్రత్తి మున్నగు వస్తువులను వారికిఁ గప్పములుగా నొసంగ నంగీకరించిరి.

23. ఈ యవ్యవస్థితపరిస్థితులను సరిపుచ్చుకొనుట లోనే చాలకాలము గడచిపోవుటచేఁ గొలంబసు గతనివేదికలోఁ దాను వాగ్దాన మొనరించిన బంగారమును స్పెయినుకుఁ బంపఁజాలకపోయెను. సువర్ణగ్రహణార్థ మోడలు రాఁగా నంత బంగారము లేకపోవుటచే నాతఁడు బానిసలుగా విక్రయింప వచ్చునను సూచనతోఁ గొన్నివందలమంది దేశీయుల నా యోడలపై స్పెయినుకుఁ బంపెను. ఉదారాశయుఁడును సాహసికాగ్రగణ్యుఁడు నైన కొలంబ సిట్టి నీచాశయమునకుఁ దా నొసంగుట వింతగాఁ గానిపించును. కాని యా పరిస్థితులలో నాతఁ డట్లు చేయవలసివచ్చెను. దయామయుఁడైన ఇజ

బెల్లా యిది గ్రహించి యా యిండియనుల మరలఁ దమ నివాసములకుఁ బంపివైచి తన యౌదార్యమును బ్రకటించెను.

24. మార్గరెటు మున్నగువారు కొలంబసునుగూర్చి చెప్పిన పలుకు లెంతవఱకు సత్యమో యెఱుంగుటకై స్పెయిను రాజదంపతులు జూయనాక్వడోయను నాతని హిస్పానియోలాకుఁ బంపిరి. ఆతని వలన మార్గరెటు ప్రచారముచేసిన యసత్యకల్పనల తీవ్రత యెఱింగి కొలంబసు వాని నసత్యములని రాజదంపతులకు నిరూపించు నుద్దేశముతో స్పెయిను దేశమునకుఁ బ్రయాణమాయెను. సరిగా నీ సమయముననే ద్వీపాంతరభాగమున విస్తారహేమనిధానములు గోచరించెనను వార్త తెలియవచ్చెను. కొలంబసు మార్గరెటు తనపై మోపిన దోషారోపణములఁ దొలంగించుకొనుటకీ నూతనపరిశోధనము మిక్కిలిగాఁ దోడ్పడెను అతఁడు క్రీ. శ. 1496 వ సంవత్సరమున స్పెయినుదేశము చేరెను. రాజదంపతు లాతని మాటలు విని యాతనికా యుద్యోగము నేగాక మఱికొన్ని నూతనబిరుదములుకూడ నొసంగి మఱుసటి సంవత్సరము మరల హిస్పానియోలాకుఁ బంపిరి.

25. రాజ్యమునందలి రాజకీయపరిస్థితుల వైపరీత్యముచేతను, అసూయగ్రస్తులైన శత్రువు లొనరించిన యాటంకములచేతను గలిగిన యాలస్యము నెట్లో సైచి కొలంబసు మూఁడవసారి యాఱు నావలతో బయల్వెడలెను. కానరీ ద్వీపములు చేరినపిమ్మటఁ గొలంబసు మూఁడు నావలను హిస్పానియోలాకుఁ బంపి, మిగిలిన మూఁడు నావలతోఁ దా హేమమునకుఁ బ్రసిద్ధివడసిన యా నూతనద్వీపములను

గనుఁగొను నుద్దేశముతో దక్షిణముగా నరిగెను. కొలంబసు నిజముగా నూత్నప్రపంచమునందలి భూభాగముపైఁ గాలుమోపినదీ మూఁడవ ప్రయాణమునందే. అంతకుముందు దానికిఁ బరిసరములనున్న ద్వీపములను మాత్రమే యాతఁడు కనుఁగొని యుండెను. యూరపుఖండమునుండి మొట్టమొదటఁ బడమరగాఁ బ్రయాణము సాగించినవాఁ డాతఁడే యైనను నూత్నప్రపంచభూభాగమునఁ దొలుఁదొల్త గాలుమోపినవాఁ డాతఁడుకాఁడు. క్యూబాద్వీప మాసియాఖండ మందలి యొక భాగమని యాతఁడు భ్రాంతి నొందియుండనిచో నా ప్రథమప్రయాణము లందే యాతఁడు క్రొత్తప్రపంచ మందలి ఖండములను గనుఁగొనియుండెడివాఁడు.

26. కొలఁదివారములు ప్రయాణముచేసిన పిమ్మటఁ గొలంబసు భూభాగమును జేరెను. అచ్చట నాతనికి మూఁడు పర్వతాగ్రములు కానిపించుటచే నాతఁడు దానికి ట్రినిడాడను పేరొసంగెను. అచ్చటికి దక్షిణ అమెరికాఖండభాగ మక్షిగోచరమగుచుండుటచేఁ గొలంబ సది యొక ద్వీపమని భావించి దానికిఁ బవిత్రద్వీపమను నర్థముగల ఐలాశాంటా యను పేరొసంగెను. కొలంబసు సహచరులతో ట్రినిడాడు తీరమున సంచరించుచుండఁగా నిండియనులు వారిని వారి నౌకలను వింతగాఁ జూచుచుఁ బరువిడఁజొచ్చిరి. నావికులు వారిని దమ నౌకలపైకిఁ గొనిపోవుట కెంతయో ప్రయత్నించిరి. కాని లాభము లేకపోయెను. అంతఁ గొలంబసొక యుపాయము పన్ని దానివలన వారిని దప్పక యాకర్షింపవచ్చు నని తలంచెను. అతఁడు నౌకలమీఁది వివిధవాద్యములను వాయిం

చుచుఁ గొందఱు నావికులను నాట్యముచేయ నాజ్ఞాపించెను. వారట్లే యొనరించిరి. కాని దానివలన విపరీత ఫలము చేకూరెను. ఇండియనులు వాద్యనృత్యములచే నాకృష్టులై నౌకల కడ కరుదెంచుటకు బదులు వానిపై బాణవర్షము కురియ నారంభించిరి. స్పెయినుదేశస్థు లంత నృత్యము మాని తుపాకులు పేల్చుటచే నిండియనులు భయపడి పారిపోయిరి.

27. ట్రినిడాడుకును దక్షిణ అమెరికాకును నడుమనున్న జలసంధికిఁ గొలంబసు సర్పముఖమను నర్థముగల సర్పెంట్సుమౌతను పేరుపెట్టెను. అచ్చటి దేశీయులు స్పెయినువారిని గాంచి భీతులగుటచే నెవ్వరును దమంతటదాము వారి నౌకల సమీపమున కరుగరైరి. ఒకమారు కొలంబసొక యుపాయముచే నిరువురు ముగ్గురు దేశీయులను బట్టుకొని తమ యోడలపైకిఁ గొనివచ్చెను. వారు చిన్న దోనెలపై సముద్రమునఁ బ్రయాణముచేయుచుండఁ గొలంబసు నానతిచే నిరువురు నావికు లోడపైనుండి యందు దుమికిరి. దోనెలు తారుమారైపోవుటచే నందలి దేశీయులు జలమునఁ బడిరి. అంత నా నావికులు వారిని బట్టుకొని యోడపైకిఁ గొనివచ్చి వారి కాటవస్తువులను నలంకారములను నొసంగి తీరమునకుఁ బంపివైచిరి. అవి చూచి యితరదేశీయులు కూడ నట్టివానిని బడయుటకై యోడల సమీపమునకు రాఁదొడంగిరి. వారు తాము నివసించు దేశము పేరు పారయా యని కొలంబసున కెఱింగించిరి. పారయాసింధుశాఖ సమీపమున స్పెయినుదేశపు నావికులు తిరుగాడుచుండ వారికిఁ బలువురు దేశీయులు కానిపించిరి. వారు దేశీయులు

విరివిగా ధరించిన సువర్ణ ముక్తాలంకారసమూహమును గాంచి యచ్చెరువందుచు ముత్యములకొఱకై కొంతదూరము తీరము వెంబడినే ప్రయాణము కావించిరి. కాని సముద్రతరంగములు విరుద్ధముగానుండుటచే వారు వెంటనే వెనుకకుఁదిరిగి రావలసి వచ్చెను. తిరిగివచ్చు సమయమున వారు పెక్కు చిన్న ద్వీపములఁ గనుఁగొనిరి. అచ్చట ముత్యపుఁజిప్పలఁ గొఱ కన్వేషించుచున్న దేశీయులు పలువురు వారికిఁ గానిపించి తమకు దొరకినివానిలో శ్రేష్ఠములైనవానిని వారి కొసంగిరి.

28. ఈ సమయమునఁ గొలంబసు ఓరినాకోనదీ ముఖ ద్వారమునఁ దిరుగుచు నా నదిద్వారా నిరంతరము సముద్రములోనికిఁ బ్రవహించుచున్న విస్తార స్వాదుజలమును గాంచి, తానుఁ గనుఁగొన్నది కేవల ద్వీపమేయగునాయని యనుమానించుచుఁ, దీరము వెంబడినే యరిగి టొబాగో గ్రానడాలను గనుఁగొనెను. ఇచ్చట నాతని కన్నులకుఁ దీవ్రమైన వ్యాధి కలుగుటచే నాతఁడు తన సందేహమును నివర్తించుకొనకుండనే హిస్పానియోలాకుఁ బోవలసివచ్చెను. తరువాతి పరిశోధనలవలనఁ గొలంబసు తా ననుకొన్నట్లొక ద్వీపమాత్రము గాని యాసియాయందలి యేక దేశముగాని కాదనియు నది మానవుల కంతకుఁబూర్వ మజ్ఞాతమైయుండిన యొక క్రొత్త భూభాగమనియు గ్రహించెను.

29. కొలంబసు పరోక్షమున హిస్పానియోలా ప్రభుత్వము నాతని సోదరుఁడైన బార్థలోమియో నిర్వహించుచుండెను. ఇజబెల్లానగర మనారోగ్యకరమని తోఁచుటచే నాతఁడు క్రొత్తఇజబెల్లా యను పేర మఱియొక నగరమును

నిర్మించెను. దానికే తరువాత శాన్‌డామిన్గో యను సిరనామ మేర్పడెను. అతఁడు దేశీయుల నందఱ వశపఱుచుకొని వారి యొద్దనుండి కప్పములను వసూలుచేయుచుండెను. కాని స్పెయినుదేశస్థులే కొందఱు గుమిగూడి యాతనిపై నొక తిరుగఁబాటుఁ గావించిరి. నిరంతరప్రయాణపరిశ్రాంతుఁడై విశ్రాంతికోఱ కేగిన కొలంబ సక్కడి కరిగి యరుగకముందే యా తిరుగఁబాటు నడఁచివేయవలసివచ్చెను. అతఁడంత దైర్ఘ్యము వీడి సామవాక్యములతోడనే యా తిరుగఁబాటు నెట్లో యడఁచివేసెను. స్పెయినుదేశముననున్న కొలంబసు విరోధులు రాజదంపతులకడ నాతనిపై లేనిపోని నేరములుమోపి యుండుటచే వారు క్రీ. శ. 1500 వ సంవత్సరమున హిస్పాని యాలోకు ఫ్రాన్సిస్కోడిబొబడిల్లా యను నొక నూతన రాజప్రతినిధిని బంపిరి. ఆతఁడు మిక్కిలి యుద్ధతుఁడై కొలంబసును దత్సోదరులను దన సమక్షమునకుఁ బిలిపించి యిష్టము లేని కొందఱు దుర్జను లొసంగిన సాక్ష్యమును బట్టి వారు నిగళబద్ధపాణులై స్పెయిను దేశమునకుఁ బోవలెనని యాజ్ఞాపించెను. కొలంబసు పయనించుచున్న నౌక యందలి యధికారి యనుకంపాకంపితుఁడై యాతని చేతి గొలుసులు తీసివేసెద నని చెప్పినను గొలంబసు తనయం దన్యాయమేమియు లేదని తాను నిరూపింపఁజాలువఱకు వానిని దొలగించుట కంగీకరింపక "న్యాయము తేలిన పిమ్మట నీ గొలుసులు తీసి వేయఁబడినను నేను బడిన కష్టమునకుఁ బ్రతిఫలముగా రాజ దంపతు లొసంగిన బహుమాన మిది యని సూచించుటకై వీనిని నా జీవితాంతము వఱకు హస్తముల ధరించెద" నని

పలికెనఁట! అవమానకరమైన యీ యనర్హదండనము కొలంబసు హృదయమున కెంత నొప్పి కలిగించెనో యీ వాక్యములు తేటతెల్లము చేయుచున్నవి

30. కొలంబసు పూర్వ మొనరించిన ప్రయాణములకును దీనికిని నెంతో వ్యత్యాసమున్నది. అతఁ డప్పుడమిత వైభవముతోడను నిప్పుడు నిగళబంధముతోడను దిరిగి వచ్చెను. కాని స్పెయినులోని జనులందఱును నాతనియెడ బోబడిల్లా వర్తించిన విధమును దెగడి పల్కిరి. కొలంబసు క్రమక్రమముగా రాజానుగ్రహమును మరల సంపాదించెను గాని యాతని కా రాజప్రతినిధిత్వము మాత్రము తిరిగి యొసంగఁబడలేదు. బోబడిల్లా హిస్పానియాలో మిక్కిలి క్రూరముగా వర్తించుటచే రాజదంపతు లాతని స్పెయినుకుఁ బిలిపించి యాతని స్థానమున నికొలసు డి ఓవండో యను నతనిఁ బంపిరి. ఈతఁడుకూడ సమర్థతతో నా పరిపాలనమును నిర్వహింపఁజాలకపోయెను. స్పెయిను దేశస్థులు మిక్కిలి నిర్దయముగా నిండియనులచేఁ బనిచేయించి, వారినిఁ బెక్కు విధముల హింసించి, విస్తారమైన బంగారమును స్పెయినుదేశమునకుఁ బంపిరి. కాని యందలి ప్రతి కణమును నిండియనుల మేని రక్తములఁ బీల్చియుండె నని యెఱింగి స్పెయిను రాజదంపతులు మిక్కిలి విచారించిరి. ఈ లోపుగాఁ గొలంబసు రాజానుగ్రహము సంపాదించి యుండుటచే నాల్గవసారి మరలఁ బ్రయాణము కావించుటకై యత్నించుచుండెను.

31. క్యూబా ఆసియాతూర్పు తీరమునందలి భాగమనియుఁ బొరయా మఱియొక క్రొత్త ఖండమనియుఁ దలంచి

యుండుటచేఁ గొలంబసీమాటా రెంటిని విడఁదీయు జలసంధిని గనుఁగొనవలెనని నిశ్చయించెను. తానాపడమటి మార్గమునను సంచరించి వెళ్లఁగా వెళ్లఁగా హిందూదేశమువచ్చి తీరునను విషయము నాతడెన్నఁడును సందేహించి యుండలేదు. పైగా నప్పటికి వాస్కోడగామా హిందూదేశమున కాఫ్రికాఖండ మునఁజుట్టి పోవు సముద్రమార్గమును గనిపెట్టి యుండుటచేఁ బోర్చుగలువా రచ్చటి సంపదలను, సుగంధ ద్రవ్యములను విరివిగాఁ దెచ్చుకొనుచుండిరి. అదిచూచి కొలంబసు స్పెయిను దేశమునకుఁగూడ నట్టిమార్గము నొకదానిని గనిపెట్టి యా సంపదల ననుభవించు సామర్థ్యము నొసంగవలెనని స్థిరసంకల్పుఁడయ్యెను. స్పెయిను రాజదంపతు లట్టిమార్గమువలనఁ దమ దేశమునకు సమకూడు నపారమైన లాభము నెఱింగినవారగుటచేఁ గొలంబసున కధికముగా సాహాయ్య మొసరింప నంగీకరించిరి. కొలంబసు క్రీ. శ. 1502 వ సంవత్సరమున సోదరుఁడగు బార్థలోమియోయును గుమారుఁడగు ఫెర్డినాండను దన్ననుసరింప నాలుగు చిన్నయోడలతో కాడిజ్ రేవులోఁ బ్రయాణమయ్యెను.

32. హిస్పానియాలో లోనంతకుముందు సంఘటిల్లిన విషమపరిస్థితుల నెఱింగినవారగుటచేఁ గొలంబసును రాజదంపతులీసారి యచ్చటి కరుగవలదని యాజ్ఞాపించిరి. కాని కానరీద్వీపములను, డొమినికాను దాఁటినపిమ్మట నౌకలు శిథిలప్రాయములౌటచేఁ గొలంబసు రాజాజ్ఞకు విరుద్ధముగా హిస్పానియాలోకుఁ బోవలసివచ్చెను. క్రొత్త రాజప్రతినిధియైన ఓవాండో యానతి ననుసరించి యచ్చటివా రాతఁడచ్చటనాగుట

ంమతింపరైరి. సరిగా నా సమయమునసే బంగారముతో
ండిన ముప్పది నౌకలు స్పెయిను దేశమునకుఁ బ్రయాణమగు
ంరెను. వానిలో నొకదానిపై ఓవండోకుఁ బూర్వము
జప్రతినిధిగానుండిన బోబడిల్లా స్పెయినుకుఁ దిరిగిపోవు
ంరెను. మఱొకదానిలోఁ గొలంబసు పాలికి వచ్చిన బంగా
ము నిండియుండెను. అనుభవజ్ఞుఁడైన కొలంబసు త్వరలోనే
ుక తుపాను రానున్నదని యెఱింగి యా యోడ లప్పటికిఁ
యాణ మాపుట మంచిదని సూచించుచు నా తుపాను
ంగియువఱకుఁదన్నచ్చట నాగనీయవలసినదని రాజప్రతినిధినిఁ
రెను ఆ రాజప్రతినిధి యాతని సూచన గ్రహింపకపోవుట
ంగాక యాతఁ డచ్చట నాగుట కిసుమంతయు సమ్మతింపఁ
యెను. కొలంబసు చేయునదిలేక యొక. రక్షణస్థలమునఁ
 యోడలతో నాగిపోయెను. ఆ ముప్పది యోడలును
ములు దేఱి యరుగుచు దారిలోఁ గొలంబసు సూచించిన
పానున కెరయయ్యెను. అం దిరువది నౌకలు సముద్రములో
ంనిఁగిపోయెను. కొన్ని నౌకలు శాన్డామిన్గో సమీపము
ంఁ గొట్టుకొనిపోయెను. కొలంబసు భాగమైన బంగారముతో
ండిన యోడమాత్రము సురక్షితముగా స్పెయిను దేశము
రెను. మానవులు నిందించువారినే వేల్పు లొక్కొక్కప్పు
ట్లు కరుణించుచుందురో యీ విషయము వ్యక్తముచేయు
న్నది.

33. తుపాను శాంతించిన పిమ్మటఁ గొలంబసు మరలఁ
 ప్రయాణమును సాగించెను. జూలై మాసాంతమున
తఁడు హాండూరా తీరమునకు దవ్వున నున్న ద్వీపసమూ

హాములఁ జేరెను. అచ్చటనుండి యాతఁడు తానూహించిన జలసంధిని గనుఁగొనుటకై తూర్పుగాఁ బయనించెను. అచ్చట వాతనిఁ గలసికొన్న దేశీయుల సూచనల ననుసరించి యేగియుండిన నాతఁడు యుకటానుమెక్సికో లను జేరియుండును. కాని హిందూదేశమును జేరవచ్చు నను నిశ్చితాభిప్రాయముతో వాతఁడు తన మార్గమునే యనుసరించుచు నతికష్టముతో హొండూరా ద్వీపములఁ జేరెను. ఇప్పటినుండి ప్రకృతియంతయు వారికి విరుద్ధముగా వర్తింప మొదలిడెను. వాతావరణ పరిస్థితులు భయంకరములుగాఁ బరిణమించెను. నావికు లందరకిని బ్రాణభీతి యుదయించెను. పైఁగాఁ గొలంబసు వ్యాధిగ్రస్తుఁడై మరణించుటకు సిద్ధుఁ డయ్యెను. దేశీయు లెవ్వరును వారియెడ సుహృద్భావముఁ జూపరైరి. అభీప్సితములైన యమూల్యరత్నాదికము లెచ్చటను గంటఁబడవయ్యెను. నావికులు విసివి కొలంబసును లోలో నిందింప మొదలిడిరి

34. ఇట్టి పరిస్థితిలో నదృష్టవశమున వాతావరణ మనుకూలమయ్యెను. ఎట్టకేలకు వారు నికరాగువా వెరాగువాలు చేరిరి. వెరాగువాలోఁ గనిపించిన విస్తారమైన సువర్ణము వారి కన్నుల కానందము చేకూర్చెను. దేశీయులు వారినుండి గ్రహించిన యాటవస్తువులకు బదులుగా బంగారు మొసంగిరి. వా రచ్చటికి సమీపముననే డెరయన్ భూసంధి కలదనియు నటుపిమ్మట మహాసముద్ర మున్నదనియుఁ బల్కిరి. కాని కొలంబసచ్చట రెండు ఖండముల నడుమ జలసంధి యుండునని స్థిరవిశ్వాసము కలవాఁడగుటచే వారి మాటలు పెడచెవిని బెట్టి ప్రయాణము సాగించుచు నవంబరు రెండవ తేదీ నాఁటికి

పోర్టొబెల్లో నౌకాశ్రయముఁ జేరఁగలైను. అచ్చటనుండి యాతఁడు తీరమునందలి గ్రామములలో నప్పుడప్పు డాగుచు ముఁదుకు సాగిపోయెను. సమీపముననే బంగారు గనులు విశేషముగాఁ గలవని దేశీయు లెంతచెప్పినను దదన్వేషణమున కియ్యకొనక తా నూహించిన జలసంధిని గనుఁగొనవలె నను పట్టుదలతో నింకను ముందుకుఁ బోవుచుండిన కొలంబసు నెడ నాతని యనుచరుల కందఱకిని ద్వేష మంకురించెను. వారు తిరిగి పోవుదమని యెంతగా వేఁడుకొన్నను గొలంబసు వినఁ డాయెను. ఎల్ రెట్రోటు చేరిన పిమ్మట నింక లాభము లేదని యాతఁడు వెనుకకు మరలి యనేక కష్టము లనుభవించుచు నెట్టకేలకుఁ బ్రాణములతో వెరాగువా చేరుకొనెను.

35. వెరాగువా చేరినంతనే నావికు లందఱును దేశీయుల సూచనల ననుసరించి బంగారమునకై యన్వేషించి సఫలప్రయత్నులైరి. మొట్టమొదటఁ గొందరుఁ దేశీయులు వారికి విరుద్ధముగా వర్తించిరి. కాని కొలంబసు కడు మెలఁకువతో వారిని వశపఱుచుకొని వారియొద్దనుండి విస్తారమైన బంగారము సంపాదించెను. బంగారు గనులు లోపలి భాగమున నున్నవని దేశీయులు చెప్పుటచే, నాతఁడు సహచరులతో నచ్చటి కేగి యట నొక వలసరాష్ట్ర మేర్పఱుప నిశ్చయించెను. కాని దేశీయులు వారిని మార్కొని ధనప్రాణములకు విస్తారమైన నష్టము కలిగించుటచేఁ గొలంబసెట్లో యచ్చట నుండి తప్పించుకొని, నౌకలు ప్రయాణాసమర్థము లగుటచేతను, ఆహారపదార్థము లైపోవుటచేతను దిరిగి హిస్పానియోలాకుఁ బ్రయాణము సాగించెను. మార్గమున వివిధములైన

యాటంకము లుప్పతిల్లుటచే నాతఁడు హిస్పానియోలా చేరఁ జాలకపోయెను. జమైకా చేరుసరికి నౌకలు మునిఁగిపోవు నేమో యను సందేహ ముదయించెను. అచ్చటి యిండి యనులు వారికిఁ బలువిధములఁ దోడ్పడుటయే కాక యాహార పదార్థము లొసంగి వారి ప్రాణములు కాపాడిరి.

36. అచ్చటనుండి హిస్పానియోలా చేరుట యెట్లను నది పెద్ద సమస్యయైపోయెను. అట్టి విషమస్థితిలో డియెగో మెండె జనునాతఁడు తాను హిస్పానియోలాకేగి ఓవండోను బ్రార్థించి వారినందఱఁ గొనిపోవుట కొక మంచి యోడ దెచ్చెదనని పల్కి యొక చిన్న పడవలో బయలుదేఱెను. కాని జమైకా దాఁటినంతనే యిండియనులు వాని మార్గ్కుని చంప నిశ్చ యించిరి. వారాఘోరకార్యమును జేయక మునుపే మెండె జెట్లో తప్పించుకొని కొలంబసు కడకరుదెంచెను. మెండెజు నిరుత్సాహమొందక మిత్రబృంద ప్రేరితుఁడై మఱొకసారి హిస్పానియోలాకు బయలుదేఱెను. చాల రోజులవఱకును హిస్పానియోలానుండి యెట్టివార్తలును రావయ్యెను. ఇంక వేచియుండఁజాలక కొలంబసు ననుచరులాతనిపైఁ దిరుగఁబాటు గావించి, కొలంబ సంతకుముందే కొన్ని చిన్నపడవలపైఁ బ్రయాణముసాగించిరి. వారు కొలఁది దూరమైన పోకముందే వ్యతిరేక వాయువుల కతమున మరల జమైకాతీరమునకుఁ దిరిగివచ్చిరి.

37 ఈ సమయమునఁ గొలంబసుకడనున్న యాహార పదార్థములన్నియు ముగిసిపోయెను. దేశీయులు వారి కాహార మొసంగ నిరాకరించిరి. కొలంబసంతఁ గింకర్తవ్యతామూఢ

ఘుఁడై యప్పటికిఁగొలఁదిరోజులలోనే చంద్రగ్రహణము కలుగునని యెఱింగిన వాఁడగుటచేఁ దమ కిండియను లాహారము నొసఁగ నిరాకరించినందునఁ దమ వేల్పులు కినుకచెంది చంద్రునికాంతి నాచ్ఛాదింప సమకట్టిరని వారి కెఱింగించెను. పున్నమనాఁడు గ్రహణముపట్టెను. దేశీయులు కొలంబసు చెప్పినదంతయు నిజమేయని గ్రహించి వారివేల్పులింకను నేమి హాని యొనరింతురోయను భయమున వారికిఁ గావలసినన్ని యాహారపదార్థము లొసంగ వాగ్దానముచేసిరి.

38. ఈ లోపుగా మెండెజు కోరికననుసరించి ఓవండో హిస్పానియోలానుండి కొలంబసు కొకదూతను బంపెను. ఆ దూత యెక్కివచ్చు నోడనుజూచి నావికులందఱును మిక్కిలి సంతోషించిరి. కాని యాదూత జమైకాలో దిగి యా యోడ వారి నందఱిని గొనిపోవుటకుఁ జాలదనియు మఱియొక పెద్ద యోడ కొలఁది రోజులలోనే యరుదెంచుననియుఁ జెప్పి కొలంబసొసంగిన ప్రతిసందేశమునుఁగొని తిరిగి వెళ్ళిపోయెను. నావికులింక వేచియుండఁజాలక కొలంబసుపైఁ దిరుగఁబడిరి. కొలంబసు వారిని శాంతింపఁజేయుటకై బార్థలోమియోను బంపెను. బార్థలోమియో పల్కినయనునయ వాక్యము లాలింపక నావికులు కయ్యమునకుఁ గాలుద్రవ్విరి. బార్థలోమియోవారి నాయకులఁ బట్టుకొని తిరుగఁబాటునడఁచివైచెను. చేయునదిలేక నావికులు తిరుగ భయభక్తులతో మెలఁగ నారంభించెను.

39. నాలుగు నెలలైనపిమ్మట హిస్పానియోలానుండి రెండు పెద్దనావ లరుదెంచెను. అందొకదానిని మెండెజు పంపి

యుండెను. రెండవది కొలంబసునెడ తాను వర్తించిన విధమునకెంతయుఁ బశ్చాత్తప్తుఁడైన ఓవండోచేఁ బంపఁబడెను. వానినిజూచి నావికు లమితానందకందళితహృదయారవిందులై జమైకా విడిచి హిస్పానియోలాకుఁ బయనమైరి. ఆగష్టు 13వ తేదీనాఁటి కాయోడలు శాన్‌డామిన్గో చేరెను. ఓవండో ప్రవర్తనము తనకసమ్మతముగా నుండుటచేఁ గొలంబసచ్చట నాగనొల్లక వెంటనే స్పెయిన్ దేశమునకుఁ బయనమయ్యెను. మార్గమధ్యమునఁ దెరచాప కొయ్య విఱిగి పోవుటచే నాతఁడొక యోడను వెనుకకుఁ బంపివైచి భగ్నప్రాయమైన రెండవ యోడలో నెక్కి క్రీ. శ. 1504 వ సంవత్సరము నవంబరు నెలలో సెంటులూకారు రేవు చేరుకొనెను. ఈ విధముగాఁ గొలంబసు నాల్గవ ప్రయాణమంతయు నమితకష్టమయమై నష్టకరముగాఁ బరిణమించెను.

40. స్పెయిన్ చేరినపిమ్మటఁ గూడఁ గొలంబసు కష్టములు గట్టెక్కలేదు. తనకు స్పెయిను రాజదంపతులు మొదట నొసంగిన గౌరవాధికారములఁ బునరుద్ధరించుకొనవలెనను కోరికతోనే యాతఁడు జీవితశేషమంతయుఁ బుచ్చెను. ఇంతలో నిజబెల్లా మరణించెను. ఆమె మరణముతో నాతని యాశలన్నియు నడుగంటెను. పిదప నెన్నివిధములనాతఁడు ఫెర్డినాండుననుగ్రహమును సంపాదింప యత్నించినను లాభము లేకపోయెను. ఇట్లు నిరాశాహతుఁడై దీర్ఘదివసములు పుచ్చి పుచ్చి యాతఁడు క్రీ. శ. 1506 వ సంవత్సరము మే20వ తేదీని తన యఱువది యొకటవయేట దివంగతుఁడయ్యెను. ప్రపంచము తనకు మేలొనరించినవాని నించుకయు సరకు చేయదను

విచారవాక్యములతో నాతఁడు తుట్టతుదియూర్పు విడిచెనఁట. పెక్కు కష్టపరంపరలకులోనై క్రొత్తప్రపంచమునకు దారి చూపిన సాహసికశిరోమణి యిట్లసత్కృతుఁడై దీనమరణమునొందుట మిక్కిలి విచారకారణమై యున్నది. కాని మహనీయులు పలువురు తమకాలములో మెప్పులొందకపోయినను బిమ్మట సర్వప్రపంచసన్నుతిపాత్రులై యశశ్శరీరమున జిరంజీవులై మనుట సహజముకదా!

# 2. వాస్కోడగామా

1. సంపదలకును సుగంధద్రవ్యములకును బేరువడసిన ప్రాచ్యదేశములను గనుఁగొను తలంపుతోఁ బడమరగా నట్లాంటిక్ సముద్రముపైఁ బయనించి కొలంబసు క్రొత్త ప్రపంచము నెట్లు కనుఁగొనఁజాలెనో వెనుకటి యధ్యాయమునఁ దెలిసికొనియుంటిమి. మరణించుదినమువఱకును గొలంబసు తాను గనుఁగొన్న దాసియాయందలి యొక ప్రక్క యనియు, నింకను గొంత ముందుకుసాగినచో హిందూదేశము తప్పక చేరవచ్చుననియు గాఢముగా విశ్వసించియుండెను. కొలంబసు మరణించిన పిమ్మటఁగాని యాతఁడు కనుఁగొన్న దజ్ఞాతపూర్వమైన యొక నూత్నప్రపంచమేకాని యాసియా ఖండముకాదను యాథార్థ్యము యూరపుఖండవాసులకుఁ దెలిసినదికాదు. కాని యాతఁడును దదనుచరులును దాము గనుఁగొన్న భూభాగముల సంపదలఁగూర్చియు, సౌందర్యమునుగూర్చియుఁ గావించిన వర్ణనలును, దత్ప్రయత్నమున వారు పొందిన యఖండయశస్సును, యూరపుఖండమునందలి యితర సాహసికులకు సముద్రయానమునెడ నమితమైన యుత్సాహము కలిగించెను.

2. కొలంబసు తాను బ్రయాణము నారంభించుటకుముందు సాహాయ్యముఁ బడయు నుద్దేశముతోఁ బలువురు రాజులను దర్శించి తన యూహాను వారికిఁ దెల్పియుండెను. వారిలోఁ బోర్చుగలురాజైన రెండవజానొకఁడు. ఆతఁ డప్పుడు తన మంత్రి లోసంగిన సలహా ననుసరించి

కొలంబసు నూహా స్వప్నప్రాయమను నుద్దేశముతో నాతనికి సాయముచేయుట కంగీకరింపఁడాయెను. కాని స్పెయిను రాజ దంపతుల యవలంబముచేఁ గొలంబసు దక్షిణముగాఁ బయ నించి కొంత భూభాగమును గనుఁగొని విస్తారమైన బంగా



వాస్కో డ గామా

రమును కొనివచ్చెనని వినినపిమ్మట నాఁతడు మిక్కిలి విచా రించి తానుగూడఁగొందఱు సాహసికులను హిందూదేశమునకు మార్గము కనుఁగొనుటకై పంపనిశ్చయించెను. అదిగాక యాతఁడు హిందూదేశమున ప్రెస్టరుజానను నొక క్రైస్తవ

చక్రవర్తి యుండెనని విని యాతని మైత్రి సంపాదింపఁగలిగి నచోఁ దమ దేశమున కఖండైశ్వర్యలాభము కలుగునని యెంచుచుండెను. అందుచే నాతఁడు విశ్వాసపాత్రులైన యిరువురు సాహసికులనెన్ని వారిని భూమిద్వారా హిందూదేశమునకేగి ప్రెస్టరుజాను వృత్తాంతము కనుఁగొనిరమ్మని పంపెను. వారు ఫ్లారెన్సు, అలెగ్జాండ్రియా మున్నగు ప్రదేశములు దాఁటి, ఏడెనునగరము చేరిరి. అచ్చట మరల కైరోలోఁ గలసికొన నిర్ణయించుకొని యిరువురు చెరియొకమార్గము ననుసరించి యేగిరి. అటుపిమ్మట వారి జాడ లేమియు వినరాలేదు. బహుశః వారు మార్గమధ్యమున మృత్యువువాతఁబడియుందురు. ఇట్లు తన ప్రథమప్రయత్నము నిష్ఫలమైపోయినను జానురాజు నిరుత్సాహముచెందక హిందూదేశసంపదలందలి వ్యామోహముచే నచ్చటి కీమారు సముద్రముద్వారా ఒక మార్గమును గనుఁగొన సంకల్పించెను. ఈ సంకల్పమున కనుగుణముగా నాతఁడు తనకు దూరబంధువైన బార్థలోమియోడి యాజను నొక సాహసికుని క్రీ. శ. 1486 వ సంవత్సరమున నాఫ్రికాఖండమునుజుట్టి హిందూదేశమునకు మార్గమును గనుఁగొనుమని పంపెను. ఆతఁ డనేకకష్టములకు గుఱియై యెట్టకేల కాఫ్రికాయందలి మిక్కిలి దక్షిణభాగమును జేరఁజాలెను. అచ్చటఁ జెలరేగిన తుపానుల బాహుళ్యమునుబట్టి యాతఁ డా భాగమునకుఁ దుపానుల యగ్రమని పేరిడెను. ఆతఁడు పోర్చుగలుచేరి తాను గనుఁగొన్న యగ్రము విషయము జానున కెఱింగింపఁగనే యాతఁడు మిక్కిలి సంతోషించి, యది హిందూదేశమునకు మార్గము కనుఁగొనవచ్చు

నను నాశను గలిగించుటచే దాని కాశాప్రదమైన యగ్రమను నర్థముగల గుడ్‌హోపగ్రమను నామధేయ మొసంగెను.

3. డియాజు ప్రయాణమున నొక వింతసంఘటనము జరిగెను. ఒక భయంకరమైన తుపాను వీవఁగా నాతని యోడ తదనుచరుల యోడలనుండి విడివడి దూరముగాఁ గొట్టుకొని పోయెను. ఆహారపదార్థములన్నియు నితరనౌకలందుండుటచే డియాజు ననుచరులు భీతులై వెనుకకుఁదిరిగిపోదమని యాతనికి సూచించిరి. డియాజు వారినెట్లో యనునయించి ధైర్యముతో ముందుకుసాగి గుడ్‌హోపగ్రమును గనుఁగొన్నపిమ్మటఁ దిరిగి పోర్చుగలు చేరనేగుచు మార్గమధ్యమునఁ దప్పిపోయిన యితర నౌకలతోఁ గలసికొనెను. కాని పాపమందుండిన తొమ్మండుగురు నావికలలో ముగ్గురుమాత్రమే కొనయూపిరితోనుండిరి. ఆతనిఁ గాంచినంతనే యా ముగ్గురిలో నొక్కఁడానందాతిరేకమును బట్టఁజాలక యాతని పాదములపైఁబడి మరణించెనఁట!

4. డియాజు గుడ్‌హోపగ్రమును గనుఁగొనిన యెనిమిదేండ్లకుఁ గొలంబసు స్పెయినుదేశమునకుఁ దిరిగివచ్చి తన నూత్నప్రపంచపరిశోధనోదంతములతో యూరపుఖండవాసులకందఱ కానందాశ్చర్యములు కలిగించెను. ప్రాచ్యదేశమునందలి వైభవములఁ గొల్లఁగొట్టుటలో స్పెయిను గాంచుచున్న యభ్యుదయము పోర్చుగలు రాజైన జానునకు సంభ్రమము కలిగించెను. అందుచే నాతఁడు గుడ్‌హోపగ్రమును జుట్టి హిందూదేశమునకు సముద్రమార్గమును గనుఁగొనవలెనని నిశ్చయించెను. అట్టి ప్రయాణ మారోజులలో మిక్కిలి యపాయకరమగుటచే దానికై యత్నించుట గొప్ప

సాహసమేకాక నిష్ప్రయోజనముకూడనని పలువురు తలంచిరి. ఆ ప్రయత్నమునుండి విరమింపుమని భూస్వాములును మంత్రులును రాజునకు విన్నవించిరి. కాని యాతఁడు తన నిశ్చయమును వీడక మూఁడు పెద్ద నౌకలను నిర్మింపవలెనని కర్మకారుల కాజ్ఞాపించెను. దురదృష్టవశమున నాయోడలు సిద్ధముకాకపూర్వమే జాను దివంగతుఁడయ్యెను. అతని తరువాత ఇమాన్యుయలు పోర్చుగలు సింహాసన మధిష్ఠించెను. హిందూదేశమునకు సముద్రమార్గమును గనుఁగొనవలెనను వాంఛ యాతనియందు జానునందుఁ గంటెఁగూడఁ దీవ్రతరమైయుండెను. వెంటనే యాతఁడా మూఁడు నౌకల నాహార పదార్థములతోడను నౌషధాదులతోడను నింపి వాస్కోడ గామాయను యువకుఁడైన యొక భూస్వామి యాధిపత్యమున నవి ప్రయాణమై వెడలుట కనుజ్ఞ యొసంగెను.

5. వాస్కోడగామా శాన్‌రఫేయిలను నోడ నధిష్ఠించి శాన్ గేబ్రియలుకుఁ దన సోదరుఁడైన పాలోను, శాన్‌మిగుయెలుకుఁ దన మిత్రుఁడైన నిఖొలసుకోయెల్లోను నాయకులుగా నియమించెను. ఆ యోడలు బయలుదేఱు సమయమునఁ బెక్కువేలమంది యావింతను జూచుటకై లిజ్బన్ రేవున కరుదెంచిరి. లిజ్బను నగరమునందలి క్రైస్తవ దేవాలయమునఁ బ్రార్థనలు జరిపి వాస్కోడగామా తన మిత్రులతో మహావైభవమునఁ బురవీధులు దాఁటి రేవున కరుదెంచెను. వారువెడలుచుండిన ప్రయాణమునందలి యుపద్రవములఁ దలంచి చూపఱులలోఁ బలువురు విచార బాష్పములు విడిచిరి. అందుచేతనే యా తీరమునకు

బొప్పతీరమను పేరుగలిగినది. వాస్కోడగామాయు, పాలోని ఖొలసులును దమ తమ నౌకల నెక్కినంతనే ప్రస్థానసమయ మును సూచించుచుఁ దుపాకులు ప్రేల్పఁబడెను. నౌకలు మూఁడును సముద్రతరంగములఁ దోసికొనుచు రివ్వమి ముం దుకు సాగెను.

6. ఆరంభదినములలో వాయు వనుకూలముగా నుండు టచే నావికు లుత్సాహమునఁ బాటలు పాడుచుఁ బ్రయాణము సాగించిరి ఆ మూఁడు నౌకలు నొండొంటికి సమీపముగాఁ బయనించుచుండుటచే నందలి వా రొండొరులతో మాటలా డుటకుఁ గూడ వీలు కలుగుచుండెను. ఒక వారమురోజు లట్లు ప్రయాణము కావించి వారు కానరీ ద్వీపములను జేరిరి. ఆ ద్వీపములు దాఁటినప్పటినుండియు వారికిఁ గష్టము లారం భించెను. పెద్ద తుపాను చెలరేఁగుటచే నోడలు మూఁడును వశము తప్పి కెరటముల చలనము ననుసరించి యటునిటు నూగులాడఁ జొచ్చెను. ఆ యలజడిలో వాస్కో యెక్కిన యోడ మిగిలిన రెంటినివీడి దూరముగాఁ గొట్టుకొనిపోయెను. తుపా నుపశమించిన పిమ్మట పాలోకోయెల్లోలు తమ నాయ కుఁడైన వాస్కో నావ కానరానందున మిక్కిలి భీతిల్లిరి. కాని యేదైనఁ గారణమున నొండొరుల వీడిపోవలసి వచ్చుచో వర్డి అగ్రిద్వీపములకడ కేగి యాగవలెనని వాస్కో యంతకు మున్నే యాజ్ఞాపించియుండుటచే వారు ప్రయాణము సాగిం చుచు నొక వారము దినములైన పిమ్మట వర్డి అగ్రిద్వీపములఁ జేరిరి. అచ్చట వారు వాస్కోడగామా నౌకనుఁ గాంచి యానందపారావారమున నోలలాడిరి. అచ్చటనుండి మూఁడు

నౌకలను మరలఁ గలసి పయనించి శాన్‌జాగోద్వీపము కడ నొక వారము రోజు లాగెను. వా రచ్చటఁ దుపాను దెబ్బచేఁ బాడైన నౌకాభాగముల బాగుచేసికొని కావలసిన జలాహార పదార్థముల సమకూర్చుకొనిరి.

7. క్రీ. శ. 1497 వ సంవత్సరము మే మొదటి తేదీని వారు శాన్‌జాగో ద్వీపమున బయలుదేఱి గుడ్‌హోపగ్రము వైపునకు సూటిగా నావలఁ బోనిచ్చిరి. వాస్కోడగామా ధైర్యోత్సాహములకు మేర లేకుండెను. సాధ్యమైనంత త్వరలో గుడ్‌హోపగ్రమును దాఁటి యేగవలెనను కుతూహలముతో నాతఁడు గినియాసింధుశాఖ నుత్తరించి దక్షిణముగా నావలఁ బోనిచ్చెను. శాన్‌జాగోద్వీపము దాఁటిన యనంతరము కొన్ని నెలలు పయనించినను వారికి భూమి జాడ కానరాలేదు. నావికులు నిరాశులై దిగులుపడఁజొచ్చిరి. తాను దప్పుదారిని బట్టెనేమో యను సందేహ మప్పుడప్పు డుదయించుచున్నను వాస్కో ధైర్యమును వీడక యితరనావికులు వెనుకకుఁ దిరిగిపోదమని పలుక "మనము హిందూదేశమునైనఁ జూడవలెను. లేదా సముద్రము నడుగుభాగమునైనఁ జూడవలె"నని వారిని హెచ్చరించెను. ఆగష్టుమాసాంతమునకు వా రాఫ్రికా దక్షిణతీరమును జేరిరి. అచ్చటఁ బగళ్ళు కుఱుచలై కానిపించెను. ఉష్ణోగ్రత యొకసారి మహాతీక్ష్ణమై వెంటనే మరల శాంతింపఁ జొచ్చెను. అచ్చటవారొక వారమురోజులాగి సెప్టెంబరు నెల తొలిరోజున మరలఁ బ్రాగ్దక్షిణముగా బయలుదేఱిరి. వాస్కోడగామా గుడ్‌హోపగ్రమింక నెంతోదూరములేదని చెప్పుచు

నుత్సాహము కలిగించుచుండ నావికులు సంతోషమున నాఫ్రికా దక్షిణతీరము వెంబడినే ప్రయాణము సాగించిరి.

8. వారు సెంటుహెలీనా నౌకాశ్రయము దాటఁగనే వాయువులు విరుద్ధముగా వీవఁజొచ్చెను. తరంగములు మింటి కెగయుచు నా నౌకల నాటవస్తువులవలె నటునిటు నూపు చుఁ కారంభించెను. నావికులింకఁ దమకు సముద్రమరణము తప్ప దని తలంచుచు వెనుకకుఁబోదమని వాస్కోడగామాకు విన్న వించిరి. వా రనుసరించుతీర మంటార్కిటికు సముద్రము వఱకు ననంతముగా నట్లే కొనసాగిపోవుననియు, నంతకుముం దచ్చుటనే పెద్ద తుపానులబారికగ్గమై పలువురు నావికులు మర ణించిరనియు, వా రాతని కెఱింగించిరి. వాస్కోడగామా యగ్రమింకఁ జాలసమీపమున నేయున్నదని వారి నోదార్చి తన పట్టుదల వీడక ముందుకుసాగుచు నేయుండెను. ఆతఁడు నాయకుఁడయ్యు సామాన్యనావికులతో సమానముగఁ గష్ట పడుచు, వారు భుజించు సామాన్యాహారము నే గ్రహించుచు, విశ్రాంతియన్నమాటే యెఱుఁగక పెక్కువిధముల వారి కాదర్శప్రాయుఁడుగ వర్తించెను. ఎన్నిమాఱులు తీరమునకు దూరముగాఁబోయత్నించినను వాయువులు నౌకలను మరలఁ దీరమునకు ద్రోసివేయుచుండెను. నావికులు నిరుత్సాహపూరి తులై లోలోన గొణఁగుకొన నారంభింప వాస్కో యొక సారి యాగ్రహపరీతుఁడై వారినందఱ నౌకోపరిభాగమునకుఁ బిల్చి గుడ్ హోపగ్రమును జుట్టిపోవువఱకు నెట్టిపరిస్థితులలో నైనఁ బ్రయాణము నాపనని తన దృఢనిశ్చయము నెఱింగిం చెను. చేయునదిలేక నావికు లాతని యానతి కొడంబడి నౌక

లను బ్రొగ్రస్థోణముగా నడపిరి. కొన్నిరోజు . లట్లు పయనించిన పిమ్మట సముద్రము శాంతమయ్యెను. ఈమారు వారికి భూమి జాడలు కానరాలేదు. వాస్కోడగామా నౌకలను భూమి దెసకుఁ ద్రిప్ప నాజ్ఞాపించెను. ఒకనాఁటి ప్రాతఃకాలమున భూమి కానరాకపోయినను దాము గుడ్‌హోప్ అగ్రమును జుట్టి వచ్చితిమని వాస్కోగ్రహించి, మిగిలినవారి కావృత్తాంతము నెఱింగించెను. నావికులు తూర్యములు మ్రోగించుచు నొం డొరులఁగౌఁగిలించుకొనుచు, వివిధ నృత్యము లొనరించుచు, మహానందము ననుభవించిరి. తాము పడిన పాటులన్నియు వారొక్కక్షణములో విస్మరించిరి. విజయవికాసభాసురమైన మోముతో వాస్కో యటునిటు నడచుచుండ నాతవియను చరులాతని పాదములపైఁబడి తమయజ్ఞానమునకు క్షమింప వేఁడుకొనిరి ఇంకఁ గొలఁదికాలములోనే కష్టములు మనః స్థైర్యమును దొలఁగింపఁ దామా సాహసికునిపైఁ దిరుగఁబడ వలసివచ్చునను విషయము వారి కప్పుడించుకయుఁ దెలియఁ దాయెను.

9. పగటివేళ వాయుగమనము ననుసరించి వేగముగాఁ బయనించుచు, రాత్రులందు మెల్లమెల్లగా నౌకలఁ బోనిచ్చుచు, వారు మరలఁ బ్రయాణముసాగించిరి. అప్పటికి శీత కాలమరుదెంచెను. తమ గమ్యస్థలమచ్చటి కెంతదూరమున నుండెనో యెవ్వరికిని దెలియకుండెను. మరలఁ దుపానులు చెలరేఁగుసూచనలు కానిపించెను. ఒకనాఁటి యుదయమున నకస్మాత్తుగాఁ దీవ్రమైన తుపాను వీవనారంభించెను. వాస్కోడ గామా సాహసముతోఁ జూచుచు నౌకోపరి భాగమునఁ

గూర్చుండి నౌకల నెట్లు నడపవలెనో నావికులకు సూచించు చుండెను. కొంతసేపటివఱకు నావికులు ధైర్యమున నాతని యానతి శిరసావహించిరి. కాని తుపాను మఱింత తీవ్రతర మగుటచేఁ గర్ణధారుఁడు వాస్కోడగామా చెంత కరుదెంచి వినయమునఁ జేతులుమోడ్చి "ప్రభూ! నౌకలీ తుపాను ధాటి కాగఁజాలకున్నవి. వానిని సాధ్యమైనంత త్వరలో భూమికిఁ బట్టించి తుపాను శాంతించునంతవఱకు నౌక సురక్షితస్థలమునఁ దల దాచుకొంద"మని పలికెను. వాస్కో యాతనిఁ గాంచి "ఓయీ! లిజ్బను రేవులో నేను ప్రయాణము నారంభించినపుడొక యంగుళమైన వెనుకకుఁ దిరుగనని యొట్టు పెట్టుకొంటి" నని చెప్పియూరకుండెను. ఆతని యాననమున నధైర్యచిహ్నములేవియు గోచరింపవాయెను.

10. గాలి యాసమయమునకు మఱింత విజృంభించెను. తరంగము లెత్తుగా నెగిరి నౌకోపరి భాగములనుగూడ జలసిక్తములు గావించెను. నావ లటునిటు నూయలలవలె నూగుచుండుటచే నావికులు సముద్రపతనభయమునఁ దమ్ము దెరచాప కొయ్యలకుఁ ద్రాళ్ళతోఁ గట్టుకొనిరి. అందుచే వారు పనిచేయుట దుర్ఘటమయ్యెను. నావలు ముక్కముక్కలై సముద్రమున మునిఁగిపోవునను భీతి యంతకంత కతిశయించెను. నావికులు వెనుకకుఁ దిరిగిపోదమని వాస్కోడగామాను వేవిధముల బ్రతిమాలిరి. కాని యాతఁడు వారి నందఱఁ జూచి "సోదరులారా! నేనొక యంగుళమైన వెనుకకుఁ దిరుగనని యిదివఱకే చెప్పితిని. వేయిమృత్యువు లొక్కసారిగా నెదుర్కొన్నను నేను ముందుకు సాగిపోవలసినదే. మనము హిందూ

దేశమును జేరనైనఁ జేరవలెను. లేదా సముద్రమున రూపు లేక నశింపనైన నశింపవలె" నని తీవ్రముగాఁ బలికి "మనము జయకరముగా నీప్రయాణమును ముగించినచో సదయుఁడైన మనరాజు మనకొనర్చు భూరి గౌరవ సత్కారముల నొకసారి తలంపుఁడు. భగవంతునిపై విశ్వాసముంచి ధైర్యమున ముందుకు సాగుఁ"డని సానునయముగా హెచ్చరించెను.

11. లిజ్బనురేవులో నౌకలు బయలుదేఱునప్పుడు మరణశిక్షకుఁ బాత్రులైన మైదాఱుగు రపరాధులను రాజోద్యోగు లందెక్కించిరి. మిక్కిలి యపాయకరములైన స్థలములఁ బరిశోధింపవలసినప్పుడు నావికుల ప్రాణముల బలియొసంగుట కంటె వాస్కోవారి నుపయోగించుట యుచితముగానుండునని వారి యూహ. ఆ యపరాధు లందఱు నిప్పుడొక్కచోఁ జేరి యలజడి కలిగింప నెంచిరి. వారు తమలోఁ దాము సంప్రదించుకొని నాయకుల యాజ్ఞ నుల్లంఘింపుఁడని ఇతర నావికులకు సైగ లొనరింపఁ జొచ్చిరి. వాస్కోడగామా యది యెఱింగి యెట్టి పరిస్థితులలోనైన వెనుకకుఁ దిరుగవలదని పాలోకోయెల్లోల కెఱింగించెను. నావికులు తిరుగఁబాటు చేయుటకు స్థిరపడినంతనే వాస్కోడగామా యందు ప్రముఖులైన వారి నందఱఁ బట్టుకొని తాము మరలఁ బోర్చుగలు చేరువఱకు వారిని నిగళబద్ధులుగా నుంచెదనని ప్రకటించెను. ఇది చూచి నావికులు భీతులై తమ యవిధేయతకు క్షమింప వేఁడుకొని నాయకులను విడిచిపెట్టవలెనని ప్రార్థించిరి, కాని వాస్కోడగామా వారి మాటలు వినిపించుకొనక, తాను స్వయముగాఁ గర్ణధారుని స్థాన మాక్రమించి, నౌకలను

నడప నారంభించెను. శాన్‌గాబ్రియల్, శాన్‌మిగుయెల్ నౌకల యందలి నావికులు శాన్‌రాఫెయిలు నందలి నావికుల స్థితి చూచి శాంతించి తిరుగఁబాటు తలంపులు విడిచివైచిరి. అంత నా మూఁడు నౌకలును మరలఁ బ్రయాణ మారంభించి మెర్సీనదీముఖద్వారమును జేరెను. అచ్చట వాస్కోడగామా కొన్ని వారములాగి తుపాను దెబ్బతిన్న నౌకలను బాగుచేయింప నిశ్చయించెను. శాన్ మిగుయెల్ పూర్తిగా శిథిలమైపోవుటచే నందలి నావికు లందఱును బదార్థసంచయముతోఁ గూడ మిగిలిన రెండు నావలలోనికిఁ జేరుకొనిరి.

12. మరలఁ బ్రయాణమై చనుచుండఁ దీరమునకు సమీపముననే వారి కొక పెద్ద దోనె కానిపించెను. అందు డెవానేయను మూరుజాతివాఁ డుండెను. అతఁడు వాస్కోడగామా ననుసరించుట కంగీకరించి యాతనికి మిక్కిలి విశ్వాసపాత్రుఁడైన భృత్యుఁడయ్యెను. మార్చి మాసాంతమునకు నావ లాఫ్రికాతీరమునకును మెడగాస్కరు ద్వీపమునకును నడుమఁగల సముద్రశాఖ ప్రవేశించెను. మొజాంబిక్ ద్వీపము తీరమున వాస్కోడగామా నావల నాపి యచ్చటి షేకుతో నుత్తర ప్రత్యుత్తరములు జరిపెను. కాని యచ్చటివారు తన నావలఁ బట్టుకొనుటకుఁ బన్నాగము పన్నుచున్నారని విని నంతనే యాతఁడు వెంటనే ప్రయాణమై వెడలిపోయెను. ఏప్రియలు మాసమున నావలు మొంబాసాద్వీపము చేరెను. కాని యచ్చటివారుకూడ మొజాంబిక్కు ద్వీపమునందలి వారి వలెఁ దన నావల నాశనము చేయుటకు యత్నించుచుండిరని

గ్రహించి వాస్కో యటనుండి వేగముగాఁ బ్రయాణము సాగించుచు మెలిండా చేరెను. అచ్చటి రాజును బ్రజలును వారిని సగౌరవముగా నాదరించి హిందూదేశమునకు సరియైన మార్గమును సూచింప వాగ్దాన మొసంగిరి.

13. వాస్కోడగామాయు నాతని సోదరుఁడైన పాలోయును మెలిండా రాజుతో సంభాషింపనెంచి రెండు పెద్ద పడవలపైఁ దీరమున కరిగిరి. ఆసంగతి యెఱింగి వృద్ధుఁడైన మెలిండా రాజు తన పరిజనులతోఁ దీరమున వేచియుండెను. ఆతనిని జూడఁగానే సోదరు లిరువురును దాము కూర్చున్న యాసనములనుండి లేచి, రిక్తశిరములు వంచి వినతు లొనరించిరి. మెలిండా రాజు తమ పడవపైకి రాఁగనే వాస్కో యాతనిముందు మోఁకరిల్లి యాసన మొసంగెను. పాలోకూడ నన్న పడవపై కరిగి యాతని యానతిపై మెలిండా రాజును జూచి "రాజా! ఇచ్చట మీరు మాకొనరించిన గౌరవమునకు మేమెంతయుఁ గృతజ్ఞులము. మీకు మిత్రులమును సేవకులమునై యుండవలెనని మాయభిలాష. మాదేశపు రాజుతో మీరు మైత్రివహించి యుండుట మాకభిమత"మని పల్కెను. మెలిండారాజామాటలు విని "నేనిదివఱకే యట్లు చేయ సంకల్పించుకొంటిని. మా జీవితాంతమువఱకు మేము మీ రాజుతో మైత్రిగలిగి వర్తించెద"మని ప్రత్యుత్తర మిచ్చెను. వాస్కోడగామా యంత మోఁకరిల్లి యారాజు పాదములు ముద్దుకొనెను. అది చూచి యోడలపై నున్న నావికులందఱును "రాజా! నీకు స్వాగత"మని యుచ్చైస్స్వరమునఁ గేకలు వేసిరి.

14. మెలిండారాజు ప్రవర్తనమువలన వాస్కోడ గామా యాతఁడు నిర్మలహృదయుఁడనియుఁ దమయెడ నెట్టి కపటమును జేయఁదలంపలేదనియు గ్రహించి, మఱునాఁడాతఁడు తమ్మాతని ప్రాసాదమునకు రమ్మని యాహ్వాన మంపఁగనే యందు కంగీకరించి పండ్రెండుగు రనుచరులతోఁ దీరమున కరిగెను. రాజానుచరులచట నాతని కెదురువచ్చి రాజప్రాసాదమునకుఁ గొనిపోయిరి. రాజు స్వయముగాఁ బ్రాసాద ద్వారముకడ కరుదెంచి వాస్కో నాలింగనపూర్వకముగా స్వాగతీకరించెను. పిమ్మట నాతఁడు వాస్కోను బ్రాసాదాంతర్భాగమునకుఁ గొనిపోయి, తన ప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొని, “ హిందూదేశమునఁ గాంబేకుఁగాక మీరు వేఱొక్కచోటికేగుట నాకభిమతము. మీకుఁ గావలసినవస్తువులేవియు నచ్చట దొరకవు. మిమ్ము కళ్లికోట నగరమునకుఁ గొనిపోవుటకై యోగ్యులైన మార్గదర్శకుల నొసంగెదను. అచ్చట మిరియములు, అల్లము విరివిగాఁ బెరుగును. ఇతర ప్రదేశములలోఁ బండు వస్తువులుకూడ నెప్పటికప్పు డచ్చటి కరుదెంచును. డెవానేకు వాని మూల్యము లన్నియుఁ దెలియును. అతని మీరుఁ దోడఁ గొనిపోయినచో నచ్చటివారు మిమ్ము మోసగింపఁ జాలరని” పలికెను. ఆతఁ డనినమాటలకెల్ల డెవానే యంగీకారపూర్వకముగాఁ దల యూపెను. రాజంత నాతని వైపునకు దిరిగి యాతఁడు పోర్చుగీసువారితో హిందూదేశమునకు వెళ్లఁ దలంచెనోలేదో యడిగెను. డెవానే యంత “నేను కళ్లికోటకే కాదు. ఈ. పోర్చుగీసు వారితోఁ బ్రపంచమంతయుఁ దిరిగిరా నిశ్చయించుకొన్నాను. నేను

వారిస్వభావమును బాగుగాఁ బరిశీలించితిని. వారు నాయెడ నెంతో యాదరముఁ జూపిరి. వారి నాయకుఁడు మిక్కిలి యుదారుఁడు. చివర నాకుఁదగిన బహుమానమును దప్పక యొసంగు"నని పలికెను. ఆమాటలు విని వాస్కోడగామా "ఓయీ! నేను నీకుఁ దప్పక తగిన బహుమానమొసఁగి పోర్చుగీసువా రెప్పుడెచ్చటి కేగినను ప్రజలు వారిని సేవించుట కాత్రపడునట్లొనర్చెద"నని పలికి రాజునుద్దేశించి "దేవా! హిందూదేశమునుండి తిరిగివచ్చునప్పు డచ్చట మాకుఁ గలుగు సుఖదుఃఖములు దేవరకుఁ దెల్పుటకై మరల నిచ్చటి కరుదెంతు" మని చెప్పెను. పిమ్మట నాతఁడు తమ యోడలలోని యాహారపదార్థము లైపోవుటచే నాదేశమున గోధుమలు లభించునాయని రాజు నడిగెను. గోధుమ లనఁగా నెట్టివని రాజు ప్రశ్నింప వాస్కోడగామా యొక పడవ నోడలకడకుఁ బంపి కొంత గోధుమపిండి తెప్పించెను. రాజది చూచి యట్టి పిండి నిచ్చు ధాన్యమచ్చటఁ బండదనియు, హిందూదేశవర్తకులు తానుపయోగించుటకై పంపిన కొంతపిండి కలదనియు, నందుండి వాస్కోడగామా తనకుఁ గావలసినంత తీసికొనవచ్చుననియుఁ బలికెను. వాస్కోడగామా సంతోషించి తమ ప్రయాణమున కనుమతి నిమ్మని వేఁడ రాజప్పుడు హిందూమహాసముద్రమునఁ బయనించుట యపాయకరమనియు, వారు వ్యాపారపవనములుకాని ఋతుపవనములుకాని వీవనారంభించిన పిమ్మటనే ప్రయాణము చేయవలెననియు, నవి వీచుటకింకను మూఁడునెలలు పట్టుననియుఁ దెలిపెను. అనవసరముగా నచ్చట నంతకాల మాగవలసివచ్చెఁ గదా యని చింతించుచు

వాస్కోడగామా తన యనుచరులతో నోడలోని కేగెను. అతఁడచ్చటి కరుగుసరికే మెలిండారాజు పంపియుండిన యుప్పుడు బియ్యమును, మేకమాంసమును, వెన్నయు, గోధుమపిండియు నోడలకుఁ జేరియుండెను. అవిచూచి వాస్కో రాజు నౌదార్య సౌహార్దముల కెంతయు మెచ్చుకొని తాము పోర్చుగలు నుండి తెచ్చి నిలువయుంచిన ఫలములు కొన్ని వెండి గిన్నెలలో నుంచి యారాజునకుఁ బంపించెను.

15. వాస్కోడగామా తామింకను నచ్చట మూఁడు నెల లాగవలెనని మెలిండా రాజు చెప్పిన విషయము పాలో కోయెల్లోల కెఱింగించెను. వారాయాలస్యమున కెంతయుఁ జింతించి మొంబాసా మొజాంబిక్కు ద్వీపవాసుల ప్రేరణచే నీలోపుగా మెలిండా రాజు హృదయము తమయెడ నెట్లు మాఱునోయని భీతిచెందిరి. పిమ్మట వారందఱును డెవానేను నిరంతర మారాజుచెంతనే యుండి యితరు లెవ్వరు తమపై నాతనికడ నిందలు మోపకుండఁ జూచుచుండవలెనని పంపిరి. డెవానే మందహాస మొనరించుచు మూరుజాతివాఁడైన తనపై వారికంత విశ్వాసము కలుగుటకు హేతువేమని యడిగెను. వాస్కో యంత నాతఁడు తమకొనరించిన యుపకారము లన్నియుఁ బేర్కొని కృతజ్ఞతాపూర్వకముగా నొక బంగారు గొలుసు తీసి యాతని మెడలో వేసెను. డెవానే పరమానందభరితుఁడై మెలిండా రాజు సన్నిధి కేగి, యాతని స్నేహమును సంపాదించి, పోర్చుగీసువారిపై నాతని యనుగ్రహము పెంపొందు నట్లొనరించెను.

16. వాస్కోడగామా యీమూఁడునెలలును వృథాగాఁ గాలక్షేపము చేయక తామింక నొనరింపఁబోవు దీర్ఘప్రయాణమున కనువుగా నోడలను బాగుచేయించి యచ్చట లభించు నాహారపదార్థముల విరివిగా సంపాదింప మొదలిడెను. ఆతఁడనుచరులతో నప్పుడప్పుడు తీరమున కరిగి రాజును దర్శించి తమ సాహసవృత్తాంతములచే నాతని నలరించుచుండెను. ఇట్లామూఁడునెలలు గడచిన పిమ్మట ననుకూలవ్యాపారపవనములు వీవ నారంభించెను. రాజానుమతిని బొంది వారు ప్రయాణమునకు సిద్ధులైరి. రాజు వారికి బియ్యము, రొట్టెలు, వెన్న, మాంసము, పంచదార మున్నగు నాహారపదార్థముల నొక పెద్ద పడవనిండఁ గానుకగాఁ బంపుటయేగాక తానుగూడ స్వయముగా నోడల కడకేగి వారికి వీడ్కోలొసంగెను. ఓడలు బయలుదేఱుటకు ముందు రాజు వాస్కోడగామాను కౌఁగిలించుకొని తిరిగి వచ్చునపుడు తప్పక వారు తన దేశమునకు రావలెనని వినయపూర్వకముగాఁ బ్రార్థించెను. వాస్కోడగామా యాతని సుహృద్భావమును సుగుణములను వేవిధముల వర్ణించి, తప్పక వచ్చెదమని వాగ్దానమొసంగి, యోడల ప్రస్థానమున కాజ్ఞయొసంగెను. మెలిండా రాజెక్కిన పడవ తీరమును జేరువఱకు పోర్చుగీసు నాయకులు నౌకోపరిభాగముల నిల్చి కృతజ్ఞతాపూర్వకముగా హస్తచాలనము లొనరించుచునే యుండిరి.

17. బయలుదేఱినప్పటినుండియు వాయువు లనుకూలముగనే వీవఁ దొడంగుటచేఁ బ్రతిదినమునకును నౌకలు హిందూదేశమునకు సన్నిహితము లగుచుండెను. రెండువారము

ల ట్లపారమైన యీ హిందూమహాసముద్రముపైఁ బయనించిన తరువాతఁ జిరాభిలషితమైన హిందూదేశతీరము కంటఁబడు నేమో యని యెల్లరును దూర్పుగాఁ జూడసాగిరి. వాస్కోడ గామా నౌకోపరిభాగమునఁ గూర్చుండి తాము హిందూ దేశమునకు సుఖముగాఁ జేరినచోఁ గలుగు కీర్తిప్రతిష్ఠలను గూర్చియు, లభించు సంపద్వైభవములనుగూర్చియుఁ దలపోయు చుండెను. అతఁడు తనతో వచ్చిన మూరుజాతివారితో సంభా షించుచు హిందూదేశమునుగూర్చి వారుచెప్పినదెల్ల నానం దముతో వినుచుండెను. మెలిండారాజు పంపిన మార్గదర్శకులు తమ పూర్వానుభవమును బట్టి త్రోవను జూపుచుండ నావికులా మార్గము ననుసరించియే నౌకలను ద్రిప్పుచుండిరి. వాతావరణము శాంతముగా నుండుటచే రెండు నౌకలును సాధ్యమైనంతవఱ కొండొంటికి దగ్గఱగనే పోవుచుండెను. వాస్కోడగామా రెండవ నౌకపైనున్న తనసోదరునితో నప్పు డప్పుడు మాటలాడుటకుఁగూడ నవకాశము కలుగుచుండెను. నావికు లుత్సాహపూరితులై తిరుగఁబాటు తలంపులెల్లవిడిచి వినయవిధేయతలతో వర్తించుచుండిరి. సుమారు పందొ మ్మిది రోజుల పయనమైన పిమ్మట మెలిండా కర్ణధారుఁడొకఁ డరుదెంచి "భూమి మిక్కిలి సమీపముగనే యున్నది. మనము రేపటి యుదయమునకుఁ దీరమును జేరుకొనవచ్చు" నని వాస్కోడగామా కెఱింగించెను. వాస్కోడగామా యాతని మెచ్చుకొని యాతనిమాటలు తప్పక యథార్థములగుఁగాక యని భగవంతునిఁ బ్రార్థించెను. అతఁడా రాత్రి నిద్రపోనే పోలేదు. సూర్యోదయము కాఁగానే నావికులెల్లరు నాతని

చుట్టుమూఁగి వెడఁదకన్నులతోఁ దూర్పునకుఁ జూడసాగిరి. కొంతసేపైన పిమ్మటఁ బలుముఖములనుండి "అదిగో భూమి అదిగోభూమి" యను మాటలు వినవచ్చెను. మఱుక్షణమునఁ గర్ణధారుఁడరుదెంచి, వాస్కోడగామాకు సాష్టాంగనమస్కార మొనర్చి, "నాయకోత్తమా! భారతదేశ తీరమదిగో" యని కంపితాంగుళితో సూచించెను. అప్పుడు నావికులొందిన యానందమునకు మేరలేకుండెను. వాస్కోడగామా మూరు జాతి మార్గదర్శకు లందఱఁ దన దగ్గఱకుఁ బిలిపించి వారిధర్మ తత్పరతను బ్రశంసించుచు వారి కందఱకు ధనకనకాంబరా దులు బహుమానముగా నొసంగెను.

18. వారికిఁ దీరము స్పష్టముగాఁ గనఁబడుసరి కపరాహ్ణ మయ్యెను. తీరమునందలి పూరి గుడిసెలును జేపలఁబట్టు పడవలును వారికిఁ గానిపించెను. బెస్తలు పెక్కురు తమ పడవలపైని యోడలకడ కరుదెంచి వేడుకతో నావిని బరిశీలింప మొదలిడిరి. అచ్చటికేఁ గనఁబడునదే కల్లికోట యనుకొని వాస్కోడగామా యా వచ్చిన యనాగరికులఁ జూచి కొంత నిరుత్సాహపడెను. కాని కర్ణధారుఁడది కాననూరే కాని కల్లికోట కాదనియు, కల్లికోటయచ్చటికి దక్షిణముగాఁ బండ్రెండు లీగుల దూరముననున్న పెద్ద పట్టణమనియు నాతని కెఱింగించెను. అంత నౌకలు దక్షిణముగాఁ బ్రయాణము సాగించెను. హిందూదేశతీరముఁ జేరితిమిగదా యను నానందముతో నా రాత్రి వాస్కోడగామా సుఖముగా నిద్రించెను. మఱునాఁడు మధ్యాహ్నము కాకమునుపే పెద్దపెద్ద సౌధములతోఁ గల్లికోట వారికిఁ గన్నులపండు వొనరించెను. అచ్చటి నౌకాశ్రి

యమునఁ దూర్పుదేశములనుండి వచ్చిన పెక్కు నౌకలు నిల్చి యుండెను. కళ్లికోట రాజునకుఁ దమయెడ నెట్టి భావము కలదో తెలియనందున వాస్కోడగామా ముందే నౌకలను నౌకాశ్రయములోనికిఁ బోనిచ్చుట యపాయకరముగా నుండునేమోయను సందేహముతో వాని నచ్చటికిఁ గొంత దవ్వున నిలిపెను. అంత నాతఁడు తన సోదరుని, కోయెల్లోను, డెవానేను దన నౌకపైకిఁ బిల్చి కళ్లికోటలోఁ దాము వర్తింపవలసిన విధమునుగూర్చి చర్చించెను. మొదట వాస్కోడగామా మఱునాఁ డుదయమునఁ దాను స్వయముగా గళ్లికోట రాజును దర్శించి తాము వచ్చిన ప్రయోజనము నాతని కెఱిగింపఁ దలంచెను. కాని డెవానే రాజు భావము తెలియకుండ నట్లు చేయుట యొకప్పుడు ప్రమాదకరముగా నుండ వచ్చునని పలుకుటచే నాతఁడా ప్రయత్నము మానెను. తెల్లవారు సరికి హిందువులతోఁ గూడిన పెక్కు చిన్నపడవ లాకెంపు నౌకల చుట్టును మూగెను. తీరమున నిల్చి పలువురు జను లాశ్చర్యముతో నానౌకలవంకఁ జూచుచుండిరి. పోర్చుగీసు నావికులు కొందఱు హిందువులను నౌకలపైకిఁ బిల్చి వారికి వస్త్రములను, వెండినాణెములను నొసంగి వారి యొద్దనున్న మత్స్యములను గొనిరి. ఆగంతుకుల రాక జామొరిన్ననఁబడు కళ్ళికోట రాజెఱింగినంతనే ఫలములను, నారికేళములను, గోడిపెట్టలను గొని వారినౌకలకడ కేగి వారినిగూర్చి యావద్వృత్తాంతమును దెలిసికొని రమ్మని కొందఱు ధీవరులను బంపెను. ఆసమయముననే కట్టెలతోఁ గూడిన పెద్దపడవతో నా క్రొత్త నౌకలకడ కరిగి కొందఱు

హిందువు లాకట్టెలను బోర్చుగీసు వారి కమ్మఁజూపిరి. కాని తమ నౌకలపైఁ గట్టెలు చాలినన్ని యుండుటచే వాస్కోడ గామా వానిని గొన నిరాకరించెను. అంత నాహిందువులు నిరుత్సాహులై తిరిగి పోవుచుండ వాస్కోడగామా వారిని బిలిచి వారికి వెండి నాణెములు పంచిపెట్టెను. హిందువు లతి సంతోషముతోఁ దీరమునకరిగి పోర్చుగీసువారి యౌదార్య మును వేనోళ్ళఁ బొగడిరి. డెవానే కట్టెలు కొనకుండఁగనె హిందువులకు వాస్కోడగామా ధనమునిచ్చుటకుఁ గారణ మేమని యడుగ నాతఁడు "నిరుపేదలైన యా యమాయకులు కట్టెలమ్ముకొనుటకై వచ్చిరి. మనముకొనకపోవుటచే నిరాశులై వారు పోవుచుండుట చూడ నాకు జాలికలిగినది. వారిశ్రమ వ్యర్థము కాకుండుటకై నేను వారికాధనమునొసంగితి" నని బదులు పలికెను.

19. నౌకలు తీరమును జేరిన నాల్గవరోజున జామొరిన్ రాయబారి యైన నాయ రధిష్ఠించిన పెద్దపడవ యొకటి శాన్‌రాఫెయిలుకడ కరుదెంచెను. ఆతఁడు పోర్చుగీసు వారి నౌకలపై కెక్కక తనపడవ నుండియే వారెవ్వరో కళ్ళి కోటలో వారి కేమికావలయునో తెలిసికొనిరమ్మని జామొరిను దన్నంపెనని చెప్పెను. వాస్కో యంత రాజు ననుమతి లేక పోవుటచేఁ దా నంతవఱకును దూతను బంపియుండలేదనియు, నాతనితోఁ దా నొక దూతను బంపుననియు, నాతఁడు జామొరిన్నడిగిన ప్రశ్న లన్నిటికిని సమాధాన మొసంగుననియుఁ జెప్పి డెవానే నాతనితోఁ బంపెను. డెవానే జామొరినును దర్శించి యాతఁ డడిగిన ప్రశ్నల కన్నింటికి సరియైన సమాధా

నము లొసంగి పోర్చుగీసువారొక గొప్ప కై స్తవరాజుపంపఁగా వెండి బంగారములును నమూల్యవస్త్రములును నొసంగి మిరియములు, ఓషధులు మున్నగు వస్తువులను గొనిపోవుటకై యచ్చటి కరుదెంచిరని తెలిపెను. అంత రాజోద్యోగులలో నొక్కఁడు డెవానే పోర్చుగీసువారితోఁ గలిసియుండుట యెట్లు సంభవించెనని యడిగెను. డెవానే పోర్చుగీసువారు మెలిండాకు వచ్చుటయు, నచ్చటి రాజునకు సువర్ణమయము లైన పెక్కు కానుక లొసఁగుటయు, నా రాజు తన్ను వారికి బాసటగాఁ బంపుటయు వారి కెఱింగించెను. ఇదంతయు విని జామొరిను సువర్ణాకృష్టచేతస్కుఁడై వాస్కోడగామా కళ్ళికోటకు యథేచ్ఛముగా రావచ్చుననియుఁ, గావలసినన్ని యోషధులను మిరియములను గొనిపోవచ్చుననియుఁ బలికి డెవానేతో వాస్కోడగామాకుఁ గానుకగాఁ గొన్ని యాహార పదార్థములు పంపెను.

20. డెవానే తెచ్చిన సుహృత్సందేశము విని, వాస్కోసోదరు లమితానందమునొంది, యాతనిని మఱునాఁడు మరల జామొరినుకడకుఁ బంపఁదలఁచిరి. తదనుగుణముగా డెవానే మఱునాఁడు జామొరినును దర్శించి శాంతి సూచకమైన సంధి కావించుకొన్నఁ గాని వాస్కోడగామా కళ్ళికోట కరుదెంచి తమ రాజు పంపిన సందేశలేఖ నాతని కొసంగుట కంగీకరింపఁడని తెలిపెను. ఈలోపుగా వాస్కోడగామాను దన పట్టణమున కాహ్వానింపవలెనని యువ్విళులూరుచున్న జామొరి న్నా విషయమునుగూర్చి తన యాప్త మంత్రులతో నాలోచించెను. కొందఱు మిత్రులు పోర్చు

గీసువారియెడ వైరుధ్యము వహించి వారిని వెంటనే పంపి వేయవలెనని యాతని కెఱింగించిరి. ఈ విధముగా జామొరిను స్నేహము లభించెనుగదా యని వాస్కోడగామాయు నాతని యనుచరులును సంతోషముతోఁ గాలముపుచ్చుచుండ రాజాస్థానమున వారిని వెంటనే వెడలఁగొట్టివేయుటకు రహస్యముగాఁ బ్రయత్నములు జరుగుచుండెను.

21. ఆరోజులలోఁ గళ్ళికోట నగరము హిందూదేశ నగరములలోనికెల్ల మిక్కిలి ప్రసిద్ధివహించి యుండెను. హిందూదేశమునందలి యితర నగరవాసులేకాక యీజిప్టు అరేబియా దేశములనుండికూడ సుగంధద్రవ్యములను, నోషధులను గొనుటకై యచ్చటికిఁ బలువురు వర్తకు లరుదెంచుచుండిరి. వాస్కోడగామా రాకకుఁ బెక్కు శతాబ్దులు పూర్వమరేబియా యందలి మెక్కాలోని యూదులు కళ్ళికోట కరుదెంచి హిందూదేశముతోడి వర్తకము తమకు మిక్కిలి లాభకరముగా నుండుటచేఁ గ్రమముగాఁ గళ్ళికోటకును దత్పరిసరప్రదేశములకును వచ్చి యందే నివసింప మొదలిడిరి. ఈ యరేబియా వర్తకుల కచ్చటఁ బెక్కు నౌకలు కూడ నుండెను. వారు సుగంధద్రవ్యములేకాక కస్తూరి, రత్నములు, దంతములు, రత్నకంబళములు, పవడములు మున్నగు నితర వస్తువులనుగూడఁ గొని తమ దేశమునకును బాశ్చాత్య దేశములకును బంపుచుండిరి. ఈ యరేబియా వర్తకులు పోర్చుగీసు నౌకల యాగమన వృత్తాంతము నెఱింగినంతనే తమ వాణిజ్య వ్యాపారంతయు నింక వారి చేతులఁ బడిపోవునని భీతిల్లి,

యందఱు నొకచోఁ గూడి, జామొరిను కేదో యొకవిధమున వారిపైఁ గోపము కలిగింప నిశ్చయించిరి. జామొరిను కొలువులోఁ బెద్ద యుద్యోగములునిర్వహించుచున్న యిరువు రధికారులకడకేగి, యమూల్యములైన పెక్కు పారితోషికములు వారి కొసంగి, వారు పోర్చుగీసువారు కేవలము వాణిజ్యము కొఱకే యచ్చటికి రాలేదనియుఁ గ్రమక్రమముగా హిందూదేశమునే జయింపఁ దలంచిరనియు జామొరిను కెఱింగించి యాతనికి వారిపై ద్వేష ముదయించునట్లు చేయుమని ప్రార్థించిరి. వారట్లే చేసెదమని చెప్పి యారబు లొసంగిన పారితోషికములను గ్రహించిరి. వారిలో గోజి లనఁబడు న్యాయాధికారి జామొరినుకడకేగి పోర్చుగీసువారిని గూర్చి యాతనితోఁ గొన్ని విపరీత వృత్తాంతము లెఱింగించి వారిని వెంటనే పంపివేయుట యుక్తమని బోధించెను. కాని జామొరిను డెవానే చెప్పిన పోర్చుగీసువారి యౌదార్యముచే మిక్కిలి యాకృష్టుఁడై యుండుటచే నాతని మాటలు సరకుచేయక పోర్చుగీసువారితో స్నేహము నెఱపుటకే నిశ్చయించెను. డెవానే రెండవసారి తనకడ కరుదెంచి నప్పుడాతఁ డాతని నోడలకడకేగనాజ్ఞాపించి వాస్కోడగామా తన యనుచరులలో నెవ్వరినైనఁ బట్టణమునకుఁ బంపి తనకుఁ గావలసిన వస్తువులఁ గొనిపించుకొన వచ్చునని తెలిపెను. జామోరిను హృదయమున నెవ్వరో విద్వేషబీజములు నాటిరని గ్రహించి వాస్కోడగామా యాతనితో నెట్లయిన సంధి గావించుకొని యాతని యనుగ్రహము సంపాదింపవలెనని యత్నించుచుండెను. ప్రవాసశిక్ష విధింపఁబడిన జోనున్యూ

నెజ్జను పోర్చుగీ సపరాధియొకఁడు వాస్కోడగామా నౌకపై నుండెను. ఆతఁడు మిక్కిలి మేధావియగుటయే కాక యారబిక్ హీబ్రూ భాషలనుగూడ నెఱింగియుండెను. వాస్కోడగామా యాతనిఁ బిలిచి డెవానేతో మఱునాఁడు నగరములోనికేగి సర్వవిషయములను సూక్ష్మముగాఁ బరిశీలింపవలెననియు దుకాణములో నేయే వస్తువులు విరివిగానున్నవో యెఱింగి రావలెననియుఁ బంపెను.

22. మఱునాఁడు న్యూనెజ్ డెవానేతోఁ గలసి నగరమున కరిగెను. అంతకుముందు హైందవులు తెల్లవారి నెప్పుడును జూచియుండని కారణమునఁ బలువురు వారిచుట్టు మూగి వారిటునటు కదలకుండఁ జేసిరి. డెవానే యంత నెట్లో న్యూనెజుతో గోజిలుగృహమున కరుగ నాతఁడు వారి నాదరించి పట్టణమున యథేచ్ఛముగాఁ దిరుగుట కనుమతి నొసంగుటయే కాక హైందవుల యాటంకము వారికిఁ గలుగకుండుటకై తన సేవకు నొకని వారితోఁ బంపెను. వారు వీథులవెంట నరుగుచుండఁగా నారబువర్తకులు వారిని గాంచి వారారాత్రి పట్టణములోనే యుండిపోవునట్లు చేయుమని గోజిలును గోరిరి. గోజిలు వారియొద్దనుండి పారితోషికములు గ్రహించి యుండుటచే నట్లు చేయుటకు వాగ్దాన మొసంగెను. దుకాణములను నందలి పణ్యములను సూక్ష్మముగాఁ బరిశీలించుచు న్యూనెజు డెవానేతో నరుగుచుండ నొక్కచో నొక్కఁడు వారిని సమీపించి మీరెక్కడికేగుచున్నారని స్పెయిను దేశ భాషలోఁ బ్రశ్నించెను. న్యూనెజు భాష నచ్చట వినుట కాశ్చర్యపడి తాము గోజిలు గృహమునఁ బండుకొనుట కరుగుచుంటిమని

యాతని కెఱింగించెను. అతఁడంత వారినట్లు చేయవలదని చెప్పి తన యింటికి రమ్మని ప్రార్థించెను. వారట్లు చేయుట కంగీకరించిరి కాని గోజిలు సేవకుఁడందుకు సమ్మతింపఁ డాయెను. పిమ్మట వారుగోజిలుకడ కేగి మఱిమఱి వేఁడుకొనఁగా నాతఁడు వారా నూతన పురుషుని యింటి కరుగుట కొప్పుకొనెను. అతఁడంత వారిని దన గృహమునకుఁ గొనిపోయి రుచికరమైన భోజనమొసంగి యాదరించెను. పిమ్మట నాతఁడు వారినౌకలెచ్చటనుండి యెట్లు వచ్చెనో యడిగి, తాను స్పెయినునందలి సెవిలునివాసిననియుఁ జిన్నప్పుడే మూరులాతని బందీకృతునిఁగావించి యాసియాఖండమునకుఁ గొనివచ్చిరనియు, వారెట్టకేలకుఁ దనకు స్వాతంత్ర్య మొసంగిన పిమ్మట నాతఁడు కళ్ళికోట నగరమునే నివాసముగాఁ జేసికొని తన ప్రాణముల రక్షించుకొనుటకై మూరుల యాచారసంప్రదాయముల ననుసరించుచుండెననియుఁ దనపేరు మాన్సైడనియు వారి కెఱింగించెను. న్యూనెజాతని మఱునాఁడు తమ నౌకలకడకు రమ్మని వేఁడుకొనెను. అతఁడందుల కంగీకరింప గోజిలు ననుమతినిబొంది మఱునాఁడా మువ్వురును నౌకలకడకరిగిరి.

23. మాన్సైడు నౌకలకడ కేగుసరికి వాస్కోడగామాయు పాలోకోయెల్లోలును నౌకోపరిభాగమునఁ గూర్చుండి సంభాషించుకొనుచుండిరి. అతఁడు వెంటనే వారి యెదుటికేగి వినయపూర్వకముగా నమస్కరించి "పూజ్యులారా! మీరిచ్చటికి రాఁగల్గుట గొప్ప యదృష్టము. కెంపులు పచ్చలు నిచ్చట విస్తారముగా నున్నవి. ఇచ్చటఁగల

సుగంధద్రవ్యములకును, న మూ ల్య ర త్న ము ల కు ను, నితర సంపదలకును మేరలే" దని పలికెను. ఆతఁడు స్పెయిను భాష మాటాడుచుండుట నాలకించి వాస్కో పరమాశ్చర్య భరితుఁడై, యాతనికి స్వాగతమొసంగి తన ప్రక్కఁ గూర్చుండఁ బెట్టుకొనెను. పిమ్మట నాతఁడు మాన్సైడును దమతో విందా రగింప నాహ్వానించి భోజనసమయమునఁ దమ వృత్తాంత మంతయు నాతని కెఱింగించెను. మాన్సైడు కళ్ళికోట నగ రమున కెట్లరుదెంచెనో యెఱింగిన పిమ్మట నాతఁడు తనకు జూమొరిను స్నేహములభించుట కవకాశము కలదాయని యాతనిఁ బ్రశ్నించెను. మాన్సైడు కొంచెముసే పాలోచించి "నాయకాగ్రణీ! నేను మిమ్ము నంచించు తలంపుతోడనే మొదట నిచ్చటి కరుదెంచితిని. నేను మీశత్రువులైన యార బుల గూఢచారినై మీవృత్తాంతమంతయు నెఱుంగు నుద్దే శముతో నిచ్చటికి వచ్చితిని. కాని మీరు నాయెడఁ జూపిన కరుణాసౌహృదములఁ జూచినంతనే నామనసు మాఱినది. నన్నిపుడు మీరు పరమమిత్రునిగా భావించి నాచే మీయిచ్ఛ వచ్చిన పనులు చేయించుకొనవచ్చు" నని పలికి యారబులు గోజిలు మున్నగు నధికారులకు లంచమొసంగి వారిపై జామొ రినుకు ద్వేషము కలిగించుటకుఁ బ్రయత్నించుటాదిగా యావ ద్వృత్తాంతము నెఱింగించెను. వాస్కోడగామా యాతని సౌజ న్యము నగ్గించి యాతనికిఁ గొన్ని యమూల్యములైన బహుమా నములొసంగి యవకాశము కలిగినప్పుడెల్లఁ దమకుఁ దోడ్పడు చుండ వేఁడుకొనెను.

24. మఱునాఁడు పాలోకోయెల్లో లెంత చెప్పినను వినక వాస్కోడగామా మిక్కిలి విలువగల పెక్కు బహుమానములతోడను, బండ్రెండుగురు పరిజనులతోడను జామొరిను దర్శనమునకై స్వయముగా బయలుదేఱెను. వాస్కోడగామా యును దత్పరిజనులును ధరించిన వింతదుస్తులను దీరస్థులైన హైందవులు విస్మయావిష్టులై పరికించిరి. పరిజనులు పండ్రెండు గురును ముందు నడవ, జామొరిను పంపిన సైనికులు వీధులలో నిరువంకల మూఁగిన జనులఁ దొలఁగించుచుండ, ద్వారగవాక్షములందును గృహోపరిభాగములందును నిసుకవైచిన రాల కుండ జనులు నిల్చి యాత్రముతోఁ జూచుచుండ వాస్కోడ గామా జామొరిను ప్రాసాదమున కభిముఖముగా మంద సుందరగమనముతో నడవసాగెను. ఆతఁ డా జనసమూహ మును జూచి "మా కిక్కడ జరుగు నీయఖండ గౌరవమును బోర్చుగలులోనివా రించుకయు నెఱుంగరుగదా"యని తలం చెను. రాజప్రాసాదద్వారమునఁ బలువురు రాజోద్యోగులు నిల్చి వాస్కోడగామా యచ్చటికిఁ జేరఁగనే గౌరవపూర్వక ముగా నాతనిని లోనికిఁ గొనిపోయిరి.

25. వాస్కోడగామా జామొరినును జూడఁగనే విన యమున వంగి చేతులు పైకెత్తి నమస్కరించెను. జామొరి న్నాతనికిఁ దన ప్రక్కనున్న యొక యాసనము చూపి కూర్చుం డుమని సైఁగచేసెను. పిమ్మట రాజోద్యోగులు వాస్కో పరి జనుల నిరువంకలనున్న యాసనములపైఁ గూర్చుండఁజేసిరి. అనం తరము చేతులు కడుగుకొనుటకై రాజసేవకులు రజతపాత్ర ములతో నుదకముఁగొనిరాఁ బోర్చుగీసువా రా నీటితో హస్త

ప్రక్షాళన మొనరించుకొని సేవకులు ముందుంచిన ఫలముల భుజించిరి. పాత్రము లధరములకుఁ దాకకుండ జలముఁ గ్రోల వలెనని చెప్పి సేవకులు పాత్రములతో నిర్మలోదకముల వారి ముందుంచిరి. ఫలభక్షణానంతర మా నీరు త్రాగుచు వారిలోఁ గొందఱు త్రాగిననీరు నాసికారంధ్రములఁ జొరఁగా నుక్కిరి బిక్కిరి యైరి. కొందఱు నోటిలోనినీరు తమ దుస్తులపైని నేలపైఁ బరవఁబడిన రత్నకంబళములపైని ఉమియఁజొచ్చిరి. అదిచూచి జామొరిను సంతోషము పట్టలేక మోఁకాళ్లపై హస్తములతోఁ గొట్టుచుఁ బకపక నవ్వసాగెను. పిమ్మట వాస్కోడగామా తాను దెచ్చిన కానుకల నన్నిటి జామొరిను సమక్షమున నుంచి యందలి కుర్చీపై నాతనిఁ గూర్చుండ వేఁడుకొనెను. ఆ వస్తువుల సౌందర్యముచే నాకృష్టుఁడై జామొరిను సంతోషమున నా యాసనముపైఁ గూర్చుండెను.

26. పిమ్మట జామొరిను వాస్కోడగామాను వారచ్చటికి వచ్చిన కార్యమేదో తన యుద్యోగులకుఁ దెల్పుమని యాజ్ఞాపించెను. వాస్కోడగామా తమ కేఁడా విషయమును జామొరినుతోమాత్రమే చెప్పుమనెనని పల్కి యట్లుచేయుటకు నిరాకరించెను. జామొరిన్నంత వాస్కోను న్యాయెజుడెవానే లను బ్రాసాదాంతర్భాగమునకుఁ గొనిపోయెను. అచ్చట సందఱును గూర్చున్నపిమ్మట వాస్కోడగామా లేచి, జామొరినువంక దృష్టులు నిగిడ్చి "రాజా! మీరే హిందూదేశరాజులలోని కెల్ల నగ్రేసరులు. మిగిలినరాజులు భవత్పాదపద్మోపజీవులై మీయనుగ్రహమున కెదురుచూచుచుందురు. మాపోర్చుగలురాజు మీవైభవసౌజన్యములఁ గూర్చి విని మీస్నేహముఁ

బడయ వాంఛించుచున్నాఁడు. మీ దేశముతో వర్తకము చేయు నుద్దేశముతో నాయన కొన్ని నౌకలనిచ్చుటకిఁ బంపనిశ్చయించి యీ కానుకలతో ముందుగాఁ దమయనుజ్ఞను బడయుటకై నన్నంపియుండెను. దైవానుగ్రహమున మేమిటకు సుఖముగాఁ జేరఁగల్గితిమి. తమరంగీకరించినచోఁ దమయౌదార్యసౌహార్దములను గూర్చి మేము మాతేని కెఱింగింతుము. వెంటనే యాయన వాణిజ్యనౌకల నిచ్చుటకిఁ బంపును. మీ మా దేశముల నడుమ జరుగు వర్తకముచే మీనగరము కీర్తివైభవములతో నలరారి ప్రాచ్యదేశ నగరములలోకెల్లఁ దలమానికమై వెలుంగు" నని పలికెను. జామొరిన్నంత "మీరిప్పుట నిచ్చువచ్చిన వస్తువులనెల్లఁ గొని తీసికొని పోవచ్చును. మీవారెల్లరు యథేచ్ఛముగా వచ్చి ఈనగరమును జూడవచ్చును. మీకు జనులవలన నెట్టియిబ్బందులు కలుగకుండ నేనుదగిన యేర్పాటులు కావించెద" నని చెప్పి పోర్చుగలు రాజేలు రాజ్యము వైశాల్యమునుగూర్చియు నాతని నౌకాసంపదను గూర్చియు, వారు ప్రయాణమున ననుభవించిన కష్టములఁ గూర్చియుఁ బ్రశ్నించెను. వాస్కోడగామా యాతని కించుక సమీపమునకు జరిగి "రాజా! ఇమాన్యుయెలురాజు హిందూదేశమునకు మార్గముకనుఁగొని దేవరవారితో సంధిగావించుకొనుటకై నన్ను నౌకలతో నిచ్చుటకిఁ బంపెను. అట్లు చేసిన పిమ్మటఁ గాని తిరిగి రావలదని యాతనియాజ్ఞ. ఆతని యానతి తలఁదాల్పనిచో నాకు శిరశ్ఛేదనశిక్ష విధింపఁబడు" నని మనవిచేసెను. అప్పటికి సూర్యోదయ మగుటచే జామొరిను కొలువుచాలించెను. వాస్కోడగామా ప్రాసాదమును వీడి

బయటికివచ్చునరికిఁ బెద్దవర్షము కురియ నారంభించెను. అందుచేఁ బోర్చుగీసువారు ధరించిన యమూల్యాంబరముల న్నియుఁ దడిసిపోయెను. తీరమున కరిగిన పిమ్మట నొక గృహ మున విడిసి వాస్కోడగామా వేఱు దుస్తులు ధరించి తనకును జామొరినుకును జరిగిన సంభాషణమంతయుఁ దన సోదరుఁ డైన పాలోకు వ్రాసిపంపెను.

27. మఱునాఁటి యుదయమున జామొరిను కోశాధి కారి కనకాంబరములును, గస్తూరీపూరితమైన యొక పాత్ర మును, మఱికొన్ని వింతవస్తువులను దెచ్చి వాస్కోడగామాకుఁ గానుకగా నర్పించె . . . నుకలవలన జామొరినుకుఁ దమ యెడ సద్భావమే కలదని వాస్కోడగామా సంతోషించెను. రాజాజ్ఞపైఁ బలువురు వర్తకులు అరుదెంచి పోర్చుగీసువారికిఁ దమకడనున్న వస్తువుల విక్రయింపఁ దొడంగిరి. పోర్చుగీసు వారు పవలెల్ల వస్తువులను పేర్చి పడవలపై నోడలకడకుఁ బంపుచు, సాయంకాలము వాని మూల్యముల నావర్తకుల కిచ్చుచుండిరి. కోశాధికారికిని గోజిలుకును జామొరిను నాస్థాన మునఁగల పలుకుబడి నెఱింగినవాఁడగుటచే వాస్కోడగామా వారిరువురికిని గొన్ని బహుమానములు పంపెను. కాని గోజి లుకంటెఁ గోశాధికారికిఁ బంపిన బహుమానము లెక్కు వ మూల్యము కలదగుటచే నాతఁడు పోర్చుగీసువారియెడ వైరు ధ్యము వహించి, యారబులకుఁ దోడ్పడ నారంభించెను. జామొ రిను పోర్చుగీసువారిని సుహృద్భావముతో నాదరించి వారికిఁ బెక్కు వాణిజ్య సౌకర్యములు చేకూర్చి యుండుటచే నారబులు మఱింత కలఁతచెంది జామొరినుకు వారిపై విరోధము కలుగు

టకుఁ దీవ్రముగా యత్నింపఁ జొచ్చిరి. వారు గోజిలుకు మఱి కొన్ని యమూల్యాలంకారములు పంపిరి. అంతేకాక వాస్కోడగామా సంరక్షణమునకై నియమింపఁబడిన సేనాధ్యక్షునికిఁ గూడ విస్తారమైన ధన మొసంగి పోర్చుగీసువారైన జామొరిను నాగ్రహామునకుఁ బాత్రులగున ట్లొనర్పఁ బ్రార్థించిరి. ఈ సేనాధ్యక్షుఁ డంత సంపన్నుఁడు కాకపోవుటచే ధనమున కాశపడి యారబుల కోరిక నెఱవేర్ప నంగీకరించెను. ఆతఁడొకనాఁ డొక పల్లకీపై వాస్కోడగామా విడిసిన తీరగృహమున కరుదెంచి జామొరి న్నానాఁడు తన గ్రామప్రాసాదమున కరుగఁ దలంచెననియుఁ, దా నచ్చటి కేగకపూర్వము వాస్కో నాతఁడు చూడఁగోరెననియు, వాస్కోడగామా కెఱింగించెను. నిజముగా జామొరి న్నట్టివార్త నాతనికిఁ బంపి యుండలేదు. వాస్కోడగామా యందలి కపటము నెఱుంగ జాలక సేనాధ్యక్షునితో జామొరినుకడ కరుగ సమ్మతించెను. దుర్మార్గుఁడైన యీ సేనాధ్యక్షుఁడు ఆరబుల సహాయమున నంతకుముందే యొక పన్నాగము పన్ని వాస్కోడగామాను దవనుచరులను నగరమునకు దవ్వుగాఁ గొనిపోయి రాత్రియగుటచే వారి నొకగుడిసెలోఁ బెట్టి తలుపువేయించెను. సూర్యోదయము కాఁగానే యొక నాయ కరుదెంచి సేనాధ్యక్షుఁ డాతనిఁ జూడ గోరుచుండెనని పలుక వాస్కో తగిన గుసు[illegible]ంచి యాతని వెంట నరిగెను. వాస్కోడగామాతో ద్విభాషి తప్ప మఱెవ్వరును వచ్చుటకు వీలులేదని యానాయ కెఱింగించియుంటచే మిగిలిన పోర్చుగీసువారందఱు నచ్చటనే యుండిపోయిరి. వాస్కోడగామా తా వెడలునప్పుడు హైఁడప్రుతేమి చేసెను

మాటాడవలదనియుఁ బ్రతీకారమునకు యత్నింపవలదనియుఁ దన యనుచరుల కాజ్ఞాపించియుండెను.

28. సేనాధ్యక్షుఁడు వాస్కోడగామాను జూడఁగనే యాతనికిఁ గూర్చుండ నాసనమైన నొసంగకుండ "ఓయీ! మీ పోర్చుగీసువారు సముద్రచోరులని మాకు మొంబాసా నుండి తెలియవచ్చినది. మీ నౌకలనెల్లఁ బట్టుకొని సత్యము నొప్పుకొనువఱకు మిమ్ముఁ గారాగారమున నుంచవలెనని జామొరి న్నాజ్ఞాపించియుండెను. నీవా సత్యము వచింపకుంటే నేనేగి జామొరినుకుఁ దెలిపెద"నని పల్కెను. వాస్కోడగామా యంత "మీరు నన్ను జామొరిను కడకుఁ గొనిపోయి నచో నేనే యాతనికి సత్యమంతయు నివేదించెదను. మీకే మియుఁ దెల్ప నే నంగీకరింప" నని చెప్పెను. సేనాధ్యక్షుఁడా గ్రహోదగ్రుఁడై "నాతో నేల చెప్ప" వని గర్జించెను. వాస్కో యేమియుఁ బలుకక యూరకుండెను. సేనాధ్యక్షుఁ డింకను బెక్కు ప్రశ్నలు కురియించెను. కాని వాస్కో వా తెఱ కదల్పఁడాయెను. అంత నా యధికారి మఱింత కోప మున నాతనిఁ గొనిపోయి యొంటరిగా నొక గృహమున బంధించియుంపఁ గొందఱు నాయరుల కాజ్ఞాపించెను. తరు వాత నాతఁడు న్యూనెజునుండి కొన్ని విషయములు గ్రహింపఁ దలంచెను. కాని యాతఁడుకూడ నేమియుఁ బలుకఁడాయెను.

29. వాస్కోకాని న్యూనెజుకాని తానేమి యొనరిం చినను గుపితులుకాక శాంతులై యుండుటచే నా సేనాధ్య క్షుఁడు వారికెట్టిహాని యొనరించుటకైన జంకుచుఁ గింకర్తవ్య తామూఢుఁడై యుండెను. తాను బోర్చుగీసువారియెడ వర్తిం

చిన విధము నెఱింగినచో జామొరిన్నేమి శిక్షించునోయని యాతని భీతి. ఆరబుల దగ్గఱనుండి తాను రాఁబట్టవలసిన ధనమునంత నాతఁడు రాఁబట్టి యుండుటచే నింక జామొరిను నాగ్రహామునుండి తన్నుఁ గాపాడుకొనుటకై యెట్లయిన వాస్కోతో మరల స్నేహాము చేయుటకు నిశ్చయించెను. అందుచే మఱునాఁడాతఁడు వాస్కోను బిలిపించి వారి నౌక లలోని సరకంతయు వెంటనే తీరమునకుఁ జేర్పవలెననియుఁ, దరువాత వారు కావలసిన సుగంధద్రవ్యములను నౌషధులను గొని సత్వరమే బయలుదేఱి పోవలెననియు జామొరిన్నాజ్ఞాపిం చెనని యాతనికిఁ దెలిపెను. వాస్కో యందుకంగీకరించి యా పని చేయుటకు ముందుగానొక సందేశహారుని నౌకలకడకుఁ బంపు టావశ్యకమని సూచించెను. అంత నా సేనాధ్యక్షుఁడు గుడి సెలో బంధించియుంచిన పోర్చుగీసు వారినందఱిని వాస్కో-డగామా దగ్గఱకు రప్పించెను. వాస్కో-డగామా నా క్రూరుఁ డైన సేనాధ్యక్షుఁడు చంపించివేయునేమోయని భీతి నొందు చుండిన వారాతనిఁ గాంచినతోడనే యపారమైన యానందము ననుభవించిరి. కాని యింకను వాస్కో కష్టములు గట్టెక్క లేదు. సేనాధ్యక్షుఁడాతనిఁ బట్టణమునకుఁ గొనిపోయి, తీరము నకు దూరముననుండిన యొక గృహామున బంధించెను. ఇచ్చట నుండి వాస్కో తానింకను ఖైదీగనే యుండెననియు, నౌకల లోని సరకుల నన్నింటిని దీరమునకుఁ జేర్పవలెననియుఁ, బోర్చు గీసు వారెవ్వరును నౌకలనుండి తీరమునకు రావలదనియుఁ, దన సోదరుఁడైన పాలోకు సందేశమంపెను. కొంతకాలమా గృహామునందే యుండి వాస్కో యెట్లో తప్పించుకొని తన

నౌకలకడకుఁ బోఁజూచెను గాని యీసేనాధ్యక్షుఁడొందు కిను మంతయు వీలు చిక్కనీయలేదు. వాస్కో యంత మంత్రరుద్ధ భుజంగమువలెఁ గోపమును లోలోన నడంచుకొని "సోదరా! మీరు నన్నింక విడుచునట్లు తోపదు. నన్నొకవేళ మీరు విడువనిచో నీవు వెంటనే మన దేశమునకుఁ దిరిగిపోయి జరిగినదంతయు రేనికి విన్నవింపుము. మీరు నన్నుఁ జంపినఁ జంపుదురుగాక. మనము హిందూదేశమునకు మార్గమును కనుఁ గొంటిమను వార్తమాత్రము పోర్చుగలు చేరవలయు"నని పాలోకు మరల సందేశ మంపెను. పాలో యీ సందేశము వినిన వెంటనే ప్రాణములు పోయినను సరే వాస్కోడగామాను విడిపింపకుండఁ దాను పోర్చుగలు తిరిగిపోఁగూడదని నిశ్చ యించుకొనెను. అవసరమైనచో యుద్ధ మొనరించుటకుఁ గూడ నాతఁడు సిద్ధపడెను. తా మచ్చటనేయుండి యాతని విడిపించుటకు యత్నించుచుందురని వాస్కోకుఁ దెలిపి యాతఁడు సరకుల నింకఁ దీరములకుఁ జేర్పవలదని నావికుల కాజ్ఞాపించెను. ఈ సంగతి విని సేనాధ్యక్షుఁడు కోపించి తాను వాస్కోయెడ వర్తించిన విధమును నిగూఢముగా నుంచి జామోరినుకుఁ బోర్చుగీసువారిపై ద్వేషము కలిగించు నుద్దేశ ముతోఁ బోర్చుగీసువారు తమ నౌకలలోని సరకులను దీర మునకు దింప నిరాకరించుటయేకాక నగరమును నౌకాశ్ర యమునందలి నౌకలను దగ్ధముచేయ సంకల్పించిరని యాతని కెఱింగించెను. అరబువర్తకులు పోర్చుగీసువారిపై మఱికొన్ని నిందలు కల్పించి జామోరినుకుఁ దెలియఁజేసిరి. జామోరిను తీవ్రకోపపూరితుఁడై పోర్చుగీసువారి నౌకలను నందలి సరకు

లను బట్టుకొని వారినందఱఁ జంపింపవలసినదని యాజ్ఞ యొసంగెను. సేనాధ్యక్షుఁడా యానతి నెఱవేర్చుటకై సంతోషమున నరుగుచుండ రాజపురోహితుఁ డాతని నాపి, రాజువంకఁ దిరిగి "దేవా! శాంతింపవలయును. సేనాధ్యక్షుఁడు చెప్పిన దంతయు నిజమేయైనను వారింతవఱకు మన కెట్టిహానియుఁ గావింపక శాంతులై యున్నారు. వారిపట్ల దోషమేదైన స్పష్టముగా గోచరించునవఱకు దేవర యాజ్ఞను గార్యరూపమున నుంచుట యుక్తముకా"దని విన్నవించెను. జామొరి న్నా పురోహితుఁడు చెప్పిన సలహా నాదరించి యప్పటి కా యాజ్ఞ రద్దు చేసెను.

30. వాస్కోడగామాను విడిపించుటకుఁ బాలో కే యుపాయమును దోఁపలేదు. హామీాగాఁ దమ నౌకలపైకిఁ బంపఁబడిన హిందువుల కమూల్యములైన పారితోషికము లొసంగి, యెట్లైన వారు తమ నాయకుని విడుదలకు యత్నింపవలె నని ప్రార్థించి, పాలో వారిని దీరమునకుఁ బంపివైచెను. వారంత రాజప్రాసాదమున కరిగి సేనాధ్యక్షుఁడు వాస్కోను బోర్చుగీసువారిని హింసించిన తెఱంగంతయుఁ దెల్పి పోర్చుగీసువారెట్టి ద్రోహమునకును సంకల్పింప లేదనియు, వాస్కోను వెంటనె విడిచిపెట్టవలెననియు లేనిచోఁ దా మాత్మహత్య గావించుకొందుమనియు జామొరిను కెఱింగించిరి. జామొరిను సేనాధ్యక్షుని దుష్టవర్తనమున కెంతయుఁ జింతించి, చీఁకటి గృహమున నేది యెట్లుజరుగునో తెలియక కాలముపుచ్చుచున్న వాస్కోను బిలిపించి జరిగినదానికంతకును క్షమింపవలెనని ప్రార్థించుచు రత్నఖచితమైన యొక యలంకారము నాతనికి బహు

మతిగా నొసంగెను. వాస్కోడగామా యింక నొకక్షణమైన నచ్చటనుండ నంగీకరింపక జామొరినుకడ సెలవుపుచ్చుకొని, తన యనుచరులతోఁ దీరమునకరిగి, యొకపడవపై శాంటారాఫె యిలుకడకు బయలుదేఱెను. ఆతనిపడవ తీరమును వీడెనో మాన్పైకు పరుగెత్తుకొనివచ్చి యందు దుమికెను. వాస్కోడగామా యాతని యనుగమనము ననుమతించెను. వాస్కోడ గామా నౌకపై కెక్కఁగనే పాలో యాతని సమీపించి యానంద బాష్పములు కాఱ గాఢముగాఁ గౌఁగిలించుకొనెను. నావికులందఱును నుత్తముఁడైన తమనాయకుఁడు తిరిగివచ్చి నందు కెంతయు సంతోషించిరి. సరిగా నాసమయముననే యనుకూలవాయువులు వీవఁదొడంగుటచే లంగరులు పైకెత్తి వాస్కోయాజ్ఞపై వారు నౌకలను సముద్రములోనికిఁ బోనిచ్చిరి.

31. వాస్కో పోర్చుగలునుండి బయలుదేఱి యప్పటికి సుమారు పందొమ్మిది మాసములయ్యెను. తిరిగి వెళ్ళునప్పుడు నౌకలు కానసూరు తీరమున నాగెను. దేవానే యాయూర నుండిపోవుటకు నిశ్చయించుకొని యచ్చట దిగిపోయెను. పిమ్మట నౌకలుగోవాచేరి యచ్చటనుండి నాలుగువారములలో హిందూమహాసముద్రమును దాఁటి యాఫ్రికాతీరము సమీపించెను. క్రీ. శ. 1499 వ సంవత్సరము జనవరి మాసమున వారు మరల మెలిండా ద్వీపము చేరుకొనిరి. మెలిండా రాజు వారి కఖండమైన స్వాగత మొసంగి వారికిఁ గావలసిన యాహారపదార్థము లన్నియు సమకూర్చెను. పండ్రెండు రోజు లచ్చట నాగిన పిమ్మట వారు మరల బయలుదేఱి

జాంజిబారు, శాన్ బ్లాసులు దాఁటి, గుడ్ హోపగ్రమును జుట్టి, ఆగష్టు మాసమున వర్డ్ అగ్రద్వీపములను జేరిరి. నౌక లచ్చటికిఁ జేరుసరికే పాలో వ్యాధిగ్రస్తుఁడాయెను వాస్కో-నేర్పుమై నాతని నొడ్డునకుఁ గొనిపోయెను. కాని మఱునాఁడే యాతఁడు ప్రాణములు విడిచెను. వాస్కో యానందమంతయు దుఃఖకలుషితమైపోయెను. తమ దేశపుఱేఁ డెంత గౌరవమొసంగినను, ఎన్ని బహుమానము లొసంగినను మరణించిన సోదరుఁడు మరల రాఁడుగదాయని యాతఁడు మాటిమాటికి వాపోవుచుండెను.

32. వాస్కో-డగామా హిందూదేశమున కేగి తిరిగి వచ్చుచుండెనను వార్త యాతనికంటె ముందుగనే పోర్చుగలు దేశము చేరెను. పోర్చుగలు రాజు తన యుద్యోగులందఱితో నా సాహసికులకుఁ దగిన గౌరవ బహుమానముల నొసంగ లిజ్బను రేవున వేచియుండెను. క్రమక్రమముగా నావార్త పురమంతయు వ్యాపించెను. జను లిసుకవేసిన రాలకుండఁ దీరమున మూగి సముద్రమువంకఁ జూడఁదొడంగిరి. కొంత సేపటి కా రెండు నౌకలును వారికి దృగ్గోచరములయ్యెను. వాస్కో-డగామా శాన్ రాఫెయిలు నౌకోపరిభాగమున నిల్చి యటు నిటు చేతులు త్రిప్పుచుండెను. మెలిండా నావికులును బోర్చుగలు నావికులును నౌకల నుండి లిజ్బను తీరము నాత్రముతోఁ జూచుచుండిరి. నౌకలు తీరమునకుఁ గొంత దవ్వున నాగిన పిమ్మట వాస్కోయును నాతని యనుచరులును బడవలపైఁ దీరమున కరిగిరి. అటు నిటు బారులుతీర్చి నిలఁబడిన జనుల నడుమనుండి వాస్కో రాజసన్నిధి కరుగుచుండ జనులు

జయజయధ్వనులు కావించిరి. రాజు వాస్కో తన చెంతకు రాఁగానే గౌరవసూచకముగా లేచి నిలఁబడెను. వాస్కో యాతని పాదములపైఁబడి వానిని మూర్కొనెను. రా జంత నాతని గ్రుచ్చి కౌఁగిలించి "నాయకాగ్రణీ! మీ రాక నా కెంతయు సంతోషదాయకమైయున్నది. భగవంతుఁడు మిమ్ము సుఖముగా మరల నీ దేశమునకుఁ గొనివచ్చి మీయెడఁగల యపారకృపాతిశయమును బ్రదర్శించినాఁడు. సోదరమరణ మెంత నివారింపఁజాలని నష్టమో నేనెఱుంగుదును. కాని నాకొఱకై నీ వా విచారమును దిగమ్రింగవలె"నని పలికి గుఱ్ఱముపై నాతని రాజప్రాసాదమునకుఁ గొనిపోయెను.

33. తీరమున దిగినంతనే యితర నావికులకుఁ గూడ బంధుమిత్రాదులు హృదయపూర్వకమైన స్వాగత మొసంగి జయజయధ్వానములతో వారిని గృహములకుఁ గొనిపోయిరి. ఆ నాఁడు పత్ని సుత పిత్రాదులఁ దనివితీరఁ గాంచి నావికు లానందసాగరమున నోలలాడిరి. ఆ నావికు లందఱును లిజ్బను నగరవాసులకు మహావీరులవలెఁ గానిపించిరి. తాము గావించిన ప్రయాణమునందలి వింతలను, జూచిన మనుష్యుల యాకారగుణస్వభావాదులను వారు చెప్పుచుండ నా రాత్రి లిజ్బను నగరవాసు లెల్లరును నిద్ర యను మాటయే మఱచి విని యానందించిరి.

34. వాస్కోడగామా పయనమంతయు మొత్తము రెండు సంవత్సరముల యాఱు మాసముల కాలము పట్టెను. సుమా రొక వందమందితో బయలుదేఱిన యాతఁడు నలువది మందితోఁ దిరిగివచ్చెను. ఓడలు మూఁడు రెండగుటయే గాక

మిక్కిలి శిథిలములై పునరుపయోగమునకుఁ బనికిరానివయ్యెను. రాజు నావికుల కందఱకు మంచి బహుమానము లొసంగి కొన్ని కొన్ని సుగంధద్రవ్యములు కూడ నిచ్చి పంపెను. మరణించిన నావికుల భార్యల కాతఁడు విస్తార ధనము పరిహారముగాఁ బంపెను. కోయెల్లోకు బహుళధనమును, సుగంధద్రవ్యములను నొసంగి రా జాతని భూస్వామిగా నొనర్చెను. వాస్కోడగామాకు డాననుగొప్ప బిరుదము నొసంగుటయే కాక రా జాతనికి సంవత్సరమున కొక వేయి డాల ర్లుపకార వేతనముగా నొసంగ నంగీకరించెను. ఆతఁడు రాజోచితాయుధములు ధరింపవచ్చునని పలికి రా జాతని నాతని జన్మస్థలమగు సినిస్ గ్రామమున కేలికగాఁ జేసెను. ఆ కాలపుఁ బోర్చుగీసు మహాకవి యొకఁడు వాస్కోడగామా సాహసకృత్యముల నొక వీరకావ్యమున నిబంధించి యాతని నామము నాచంద్రార్కస్థాయిగా నొనరించెను. కాని వాస్కో పడిన కష్టములతోఁ బోల్చి చూచినచో నాతఁ డొందిన గౌరవ బహుమానములు మిక్కిలి స్వల్పములుగా గోచరించును. "సాహసేలక్ష్మి" అను నానుడిని సార్థకముఁ గావించి, సముద్ర యాత్రికుల కెల్లర కొజ్జబంతియై పేరు ప్రఖ్యాతు లందిన సాహసిక శిఖామణి వాస్కోడగామా.



# 3. సర్ ఫ్రాన్సిసు డ్రేకు

1. క్రీ. శ. 16 వ శతాబ్దిలో నాంగ్ల దేశము నెలిజబెత్తు మహారాజ్ఞి పరిపాలించు చుండెనని మీరెఱుంగుదురు. ఆ కాలమున నాంగ్ల దేశమునకును స్పెయిను దేశమునకును దీవ్రమైన విరోధముసాగుచుండెను. ఆకారణముచే నెలిజబెత్తురాణి సాహసికులైన యోధులను, నావికులను, ధీశాలులైన రాజనీతి వేత్తలను సర్వవిధములఁ బ్రోత్సహించుచుండెను. రాణి ప్రోత్సాహమున కనురూపముగ నపారసాహసమునం బ్రపంచము చుట్టును జయనించి, విరోధుల నోకలఁ గొల్లఁగొట్టి విస్తార ధనముతో స్వదేశమునకుఁ దిరిగి వచ్చిన సాహసికాగ్రగణ్యులలో సర్ ఫ్రాన్సిసు డ్రేకు ప్రథమగణ్యుఁడు. స్పెయిను దేశస్థుల నెల్లపు డేవగించుకొనుచు నాతఁ డవకాశము చిక్కినప్పుడెల్ల వారిపై దెబ్బతీయుటకుఁ బ్రయత్నించుచుండెను. అమెరికా దేశీయుల యెడ వారు చూపుచుండిన రాక్షస క్రౌర్యమే వారిపై నాతనికిఁ గల యాగ్రహమునకుఁ గారణము. స్పెయిను వారును నాతని మిక్కుటముగ ద్వేషించుచు నతని పేరు చెప్పినంతనే గడగడ వడంకుచుండిరి. వారాతని స్పెయిను భాషలో ఘోర రాక్షసుఁడను నర్థముగల 'ఎల్ డ్రేక' నుపదముతోఁ బిలుచుచుండిరి.

2. క్రీ. శ. 1573 వ సంవత్సరమున డ్రేకు ప్రపంచము చుట్టును బర్యటనము కావింపవలెనని నిశ్చయించుకొనెను. అతఁ డాసమయమున నమెరికా మధ్య దేశమున నుండెను. మిత్రులైన కొందఱు దేశీయుల తోడ్పాటుచే నాతఁడు పెనామా

భూసంధిని దాఁటుచుండ వారాతని నొక యున్నతమైన వృక్షముకడకుఁ గొనిపోయిరి. ఆ వృక్షము నధిరోహించినంతనే యాతని కన్నులకు విశాలమైన శాంతమహాసముద్రము గోచరించెను. దానిని జూచి యాతఁడుత్సాహపూరితుఁడై యా సము



ద్రమునంతను బరిశోధించు సామర్థ్యము తనకొసంగుటకై భగవంతుని వే విధములఁ బ్రార్థించెను. తన యభీష్టము నెట్లు నెఱవేర్చుకొనుటా యని యాతఁడు తరువాతఁ గొన్ని నెలల వఱకుఁ దదేకధ్యానముతో నాలోచించుచునే యుండెను. అమెరికా పడమటి తీరము ననుసరించి పయనించుచు నాప్రదేశము

నంతను దమవశము చేసికొని రాజభోగములతోఁ గాలము పుచ్చుచున్న స్పెయిను దేశీయులపై హఠాత్తుగాఁబడి వారిని కలఁగించివేయవలెనని యాతని సంకల్పము.

3. ఎలిజబెత్తు రాణి యాస్థానమునఁ బలుకుబడిగల సుహృద్వరేణ్యుల సాయమున క్రీ. శ. 1577 లో డ్రేకు తన పరియత్నమునకు రాణియనుమతిఁ బడసెను. కాని స్పెయిను దేశీయుల పట్టణముల ముట్టడించు విషయమునుగాని వారి నౌకలను గొల్లఁగొట్టు విషయమునుగాని యాతఁడామెతో నిసుమంతయు సూచించియుండలేదు. డ్రేకు మన స్తత్త్వమును సాహసపరాక్రమములను బూర్తిగా నెఱింగియుండిన యామె యాతఁడు చెప్పకుండనే యాతని ప్రయాణమునందలి యంత రార్థమును గ్రహింపఁజాలెను. ఆమె యాతని గౌరవపూర్వకముగా రాజప్రాసాదమునకుఁ బిలిపించి, యమూల్యమైన యొక ఖడ్గము నాతనికిఁ బారితోషికముగా నొసంగుచు "ఎచ్చటనైన నెవ్వరైన నిన్నెదిరించినచో వారు మమ్మెది రించినట్లే" యని పలికి యనుగ్రహసూచకముగా మందహాస మొనరించెను. ఆ మందహాసరోచులు డ్రేకు నేత్ర చకోరము లకు శరచ్చంద్ర చంద్రికలై యొప్పారెను.

4. డ్రేకు సాహసపరాక్రమము లాబాలవిదితములగు టచే నాప్రయాణమున నాతని ననుసరించుటకుఁ గులీనులును సాహసప్రియులునైన పలువురు యువకులు సంసిద్ధులైరి. డ్రేకు వారిలో నూటయిఱువదిమంది నెన్నుకొని యైదు చిన్న నౌకలతో క్రీ. శ. 1577 వ సంవత్సరము నవంబరు 15 వ తేదీని ప్లిమత్తునౌకాశ్రయములో బయలుదేఱెను. పెలికాను, ఎలిజ

బెత్తు, మేరిగోల్డు, శ్వాను, క్రిష్టోఫరు అనునవి యైదు నౌకల పేళ్ళు. ఈనావలపైఁ గొన్నివందల యోజనముల దూరము పయనింపఁ దలచియుండుటచే డ్రేకు కావలసిన సాధనసామగ్రి యంతయుఁ దెప్పించి వానిలో వేయించెను. పెలికానులో నాయకుఁడు నివసించుగది మహావైభవముగా నలంకరింపఁబడెను. అందావశ్యకములైన సర్వపదార్థములును సమగ్రములై కన్నుల పండువు చేకూర్చుచుండెను. ఒక బల్లపై సుందరములైన రజితపాత్రలును గాజుఘటములును సమర్పఁబడియుండెను. ప్రయాణికుల కప్పుడప్పు డానందప్రోత్సాహములనొసంగుటకై నిపుణులైన గాయకులుకూడ వారి ననుసరించుచుండిరి. బంధుమిత్రాదులు తీరమునుండి విషాదానందమిశ్రితములైన భావములతోఁ జూచుచుండ సాహసికులైన యాయువకు లుత్సాహమునఁ బెంగ్లికిఁబోవున ట్లానౌకలపై నెక్కి ప్రయాణము సాగించిరి.

5. తన ప్రయాణమునందలి పరమార్థము నెవ్వరికిని ముందుగాఁ దెలుపఁగూడదను నుద్దేశముతో డ్రేకు తోలుదొల్తఁ దనయనుచరులతోఁ దాను వర్తకమునకై ప్రాచ్యదేశముల కరుగుచుండెనని చెప్పెను. కాని యాయనుచరులు కాని తీరమునందున్న బంధుమిత్రాదులు కాని డ్రేక్కొనరించుచుండిన యాప్రయాణము వాణిజ్యైకప్రయోజనమని విశ్వసింపఁ జాలకపోయిరి. నౌకలు కన్నులకుఁ గనఁబడునంతదనుకఁ దీరముననిల్చి పిమ్మట బంధుమిత్రాదులు తమతమ నివాసముల కరిగిరి. మొదటి రెండురోజులు నెట్టి యాటంకములును లేక నౌకలు సురక్షితముగాఁ బయనము సాగించెను.

6. మూఁడవరోజున భయంకరమైన ఝంఝామారుతము వీవసాగెను. నౌకలన్నియు దెబ్బతిని భగ్నప్రాయములగుటచే డ్రేకు వానిని ఫాల్మూతురేవునకుఁ జేర్ప నాజ్ఞాపించెను. కొలఁదిదినములలోనే చెడిన భాగముల బాగుచేయించి వారు వానిని బ్రయాణమున కర్హములు గావించిరి. కాని వాతావరణపరిస్థితి యింకను ననుకూలముగా నుండకపోవుటచే వారచ్చట సుమారొక నెలదినము లుండిపోవలసి వచ్చెను. డిసెంబరు 13 వ తేదీనుండి వాయువులనుకూలముగా వీవ నారంభింప నావలు మరల బయలుదేఱి, బిస్కే అఖాతము దాఁటి యాఫ్రికాఖండపుఁ బశ్చిమోత్తరభాగమున నుండిన మొగడారు రేవు చేరుకొనెను. అచ్చట డ్రేకు తనప్రయాణమునందలి పరమార్థమును దనయనుచరులందఱికిని నెఱింగించెను.

7. డ్రేకు మొదటఁ గావలసిన యాహార వస్తువులఁ దెచ్చుటకై యొకపడవను దీరమునకుఁ బంపెను. తీరమునందలి దేశీయులును నారంభమున సుహృద్భావముననే ప్రవర్తించిరి. ఆపడవ యింకను దీరమునకుఁ జేరకమునుపే జానుఫ్రైయను నతఁ డందఱికన్న మున్నుగాఁ దీరముఁజేరితినను ప్రశంసఁ సంపాదించుటకై పడవనుండి నీటిలోనికి దుమికి యాసాహసమునకు దగినఫలము వెంటనే యనుభవించెను. ఏలయన నాతఁడు తీరమున్నుజేరిన వెంటనే సాయుధులైన కొందఱు మూరు లరుదెంచి యాతని నొకయొంటెపీపుపై నెక్కించి సత్వరముగా లోనికిఁ గొనిపోయిరి. ఈవృత్తాంతము నెఱింగి డ్రేకు వెంటనే కొంత రక్షణసంఘముతోఁ దీరమున కరుదెంచి పరిసరప్రాంతము లన్నియు వెదకెను. కాని ఫ్రైజాడలుగాని యాతనిని దీసికొని

పోయిన మూరులజాడలుగాని యేమియుఁ గానరాకపోవుటచే వారు ఫ్రైకిఁ దిలోదకములు విడిచి తమ పడవలపైనెక్కి ప్రయాణముసాగించిరి. అప్పుడు పోర్చుగీసువారు తన రాజ్యముపై దండెత్తనున్నారని వినియుండుటచే నాంగ్లేయులవలన నారహస్యమేదైనఁ దెలియునేమోయను నుద్దేశముతో ఫెజ్ రాజు మూరులచే ఫ్రైని బట్టించెనని తరువాతఁ దెలియవచ్చెను. ఫ్రైవలనఁ దమకుఁ గావలసిన విషయము లేమియుఁ దెలియకపోవుటచే మూరులాతని విడిచిపుచ్చి తీరమునకుఁ బంపివైచిరి. కాని యప్పటికి డ్రేకుసంఘమువారి నౌకలన్నియు వెళ్లిపోవుటచే ఫ్రైకైన దురదృష్టమును నిందించుకొనుచు నేమిచేయుటకుఁ దోఁపక తీర[illegible]న వేచియుండి యాంగ్లదేశమున కరుగుచుండిన యొకానొక యోడలోఁ దిరిగి యాదేశమునకే వెడలిపోయెను.

8. మొగడారు రేవు దాఁటినపిమ్మట డ్రేకు ధనరాసులతో నిండిన యొక పోర్చుగీసు నౌకను ముట్టడించెను. కొన్నిరోజులైనపిమ్మట బ్రావాద్వీపముకడ నాతఁ డందలి ప్రయాణికుల నందఱు విడిచివైచి దాని కర్ణధారునిమాత్రము తనతో రమ్మని బలవంతపెట్టెను. ఆతఁ డిదివఱ కట్లాంటికు మహాసముద్రమునందలి దక్షిణభాగమునఁ బెక్కుసారులు పయనించియుండుటచేఁ దమ ప్రయాణములో నాతని యనుభవము నుపయోగించుకొనవచ్చునని డ్రేకభిప్రాయపడెను. ఆతఁ డెట్టకేలకుఁ దమతో వచ్చుట కంగీకరింప, డ్రేకు తమ నావలను నైరృతిదిశాభిముఖముగా నడపుమని యాజ్ఞాపించెను. కాని యప్పటినుండి సుమారు రెండునెలలవఱకు భూమిజాడలు వారికిఁ గానరాలేదు. ఈ రెండుమాసములలో

నౌకానివాసు లొందిన కష్టమునకును నైరాశ్యమునకును నంతులేకుండెను. ఒకప్పుడు పిడుగులతోఁగూడిన తుపానులును, మఱొకప్పుడు కుంభవృష్టిగాఁబడుచుండెన భీకరవర్షములును వారి నౌకల నపాయస్థితిలోనికిఁ దెచ్చెను. కొన్నియెడల వారు చండభానుని తీవ్రాతపమున కోర్వఁజాలక నౌకోపరిభాగములఁ గూర్చుండి శీతలపవనప్రసారమునకై యఱ్ఱులు చాచుచుండిరి. తన యనుచరులలో నసంతృప్తి చెలరేఁగుచుండుటచే ధైర్యవంతుఁడైన డ్రేకుకూడ మానసమున నించుక కలఁత నొందెను. కాని ఏప్రిలు 5 వ తేదీని బ్రెజిలుతీరము దృగ్గోచరమగుటచే నాతని భయము చాలవఱకు శాంతించెను.

9. కొన్నిదినములైన తరువాత వారు ప్లేటునదీముఖద్వారముఁజేరి, యాహారపదార్థములను జలమును సంపాదించుకొనుచు నచ్చట సుమారొక పక్షముదినము లాఁగిపోయిరి. శీతకాలము సమీపించుచున్నదని యెఱుంగుటచే డ్రేకు సురక్షితమైన నౌకాశయము నన్వేషించుచుఁ దీరము వెంబడి దక్షిణముగాఁ బ్రయాణము సాగించి నడుమ నొకచోనాగి యొక యఖాతమును బరిశీలింప నేగెను. ఆతఁడు తిరిగివచ్చుసరికి వారి నౌకలన్నియు సాంద్రనీహారముచే నాచ్ఛాదితములై యెచ్చటను గానరావాయెను. డ్రేకు విషణ్ణుఁడై యటునిటుఁ జూచుచుండ మేరీగోల్డునావకు నాయకుఁడైన థామసెట్లో యాతనిజాడ కనిపెట్టి, పిలిచి యోడపై నెక్కించుకొనెను. మఱునాఁటి యుదయమున నొక తుపాను వీచుటచే మిగిలిన నాలుగు నౌకలును జెదరి యెచ్చటికో కొట్టుకొనిపోయెను. అందుచే డ్రేకు మరలఁ దీరమున కరిగి వాని పొలఁకువ నార

యుచుండ దేశీయు లాతనిఁజూచి భీతిచేతస్కులై పాఱఁదొడంగిరి. ఆ యవకాశమును బురస్కరించుకొని యాతఁడు వారి గుడిసెలన్నియుఁ బరిశీలించెను. అందాతనికి బెక్కు వింతవస్తువులు కానిపించెను వానిలో దేశీయు లుష్ట్రపక్షులను వేఁటాడుటకుపయోగించు సాధన మాతని కాశ్చర్యము కలిగించెను. ఈ సాధన మొక పెద్దదైన పక్షియాకారమున నుండెను. దాని కుష్ట్రపక్షియొక్క యీకలును శిరోగ్రీవాదులును గట్టఁబడియుండెను. వేఁటగాండ్రీ సాధనముల ముందుంచుకొని, వానికిఁ గట్టఁబడిన చెక్కలనంటుకొనుచుండి, యుష్ట్రములకుఁ గానఁబడకుండ వానిచెంతకేగి మిక్కిలి సులభముగా వానిని బట్టుకొందురు. ఇట్లు దేశీయులచేఁ బ్రతారితములై చంపఁబడిన యుష్ట్రపక్షుల శరీరము లెన్నో యచ్చట డ్రేకునకుఁ గానఁబడెను. ఇట్లు తిరిగి తిరిగి యాతఁ డెట్టకేలకుఁ జెదరిపోయిన నావలఁ గనుఁగొని మరల వానిని దననౌకతోఁ జేర్పఁజాలెను.

10. ఈ సమయమునఁ దుపానులు మిక్కిలి తఱచుగాఁ గలుగుచుండుటచే నౌక లొండొంటితోఁ గలయక దూరముగాఁ గొట్టికొని పోవుచుండెను. ఈ కారణమున వారి ప్రయాణము కడుంగడు మందముగా సాఁగఁజొచ్చెను. ఎట్టకేలకుఁ బ్రాణము విసివి డ్రేకు తమ యైదునావలలో రెంటిని విడిచివేయుటకు నిశ్చయించెను. క్రిష్టోఫరను నావ గట్టుతాకి తుత్తునియలగుటచే నందలి చెక్కల నితరనావలలోనివారు వంటచెఱకుగా నుపయోగించుకొనిరి. కొన్నిరోజులతరువాత శ్వానను నావకుఁగూడ నిట్టిగతియే తటస్థించెను. చిట్టచివరికి

జూను 20 వ తేదీనాఁటికి డ్రేకు సెంటుజూలియను రేవుచేరి యందు సుమారు రెండునెలలు కాలముండి పోయెను.

11. ఈరేవుకడ డ్రేకు సంఘమువారి కనేకములైన యాపద లుప్పతిల్లెను. అందుచేతనే వారు దానిని విడిచినంతనే దానికి నింద్యమైన రేవని పేరిడిరి. తీరమునకుఁ గొంతదూర మున నౌకలకు లంగరువేసి డ్రేకు కాప్టెను వింటరుతోడను, దుపాకిని పేల్చుటలోఁ గృతహస్తుఁడైన యొక మిత్రునితోడను మఱియాఱుగు రనుచరులతోడను, ననుగమింపఁబడి యొక చిన్న పడవపై దీరమునకరిగెను. తీరమున దిగిన వెంటనే వారికి భీకరాకారులై యిరువురు దేశీయులు కానిపించిరి. కాని వారు మంచివారలై సుహృద్భావమును బ్రకటించుటయేగాక తుపాకి పేల్చుటలో డ్రేకుమిత్రుఁడు చూపుచుండిన నైపుణ్య మును కాతని నెంతయో ప్రశంసించిరి. మఱికొంతసేపటికిఁ బలువురు దేశీయు లరుదెంచి యాయాంగ్లేయులను బరివేష్టిం చిరి. వారి ముఖరేఖలు తిలకించినంతనే డ్రేకు వారు తమ కేదో హానిచేయఁ దలపెట్టిరని గ్రహించెను. వింటరు తుపాకి పేల్చుటచే వారి దృష్టినాకర్షింపవలెనని యత్నించెను గాని యది యప్పుడెంచుక చెడిపోవుటచే నాతని యత్నము నిరర్థక మయ్యెను. అదిచూచి దేశీయులు విల్లమ్ములు చేత గ్రహించి నంతనే డ్రేకు వెనుకకు మరలిపోవుట యుక్తమని తన మిత్రు లకు సూచించెను. వారట్లు చేయుటకు వెనుకకుఁ దిరుగఁగనే పెక్కువాఁడితూపులు రివ్వున నరుదెంచి వారినిఁ దాకెను. వింటరుకుఁ దీవ్రమైన గాయము తగిలెను. డ్రేకు మిత్రుఁడు వారిపైఁ దుపాకి పేల్చుటకు యత్నించెను. కాని యది గుఱి

తప్పెను. ఆతఁడు దానిని మరలఁ బ్రేల్చుటకు యత్నించుచుండఁ గనే యొక శాతవిశిఖ మాతని వక్షమునఁ దాఁకి యాతని ప్రాణములు తీసెను. అంతట డ్రేకు ధైర్యమున నాతని చేతి నుండి తుపాకి గ్రహించి దేశీయులలో నొకని కత్యంత సమీప ముగా నేగి దానిని బ్రేల్చెను. ఆదేశీయుని మేను సహస్ర ఖండములై రూపులేకుండఁ బోయెను. దేశీయు లాతని పాటు చూచి భీతభీతులై పరువెత్తిరి. డ్రేకంత బ్రతుకు జీవుఁడా యనుకొని వింటరు నతి జాగరూకతతోఁ దమ నావలకడకుఁ గొనిపోయెను. కాని యాతఁడు తన మిత్రుల నపారవిచార పారావారమున ముంచి మఱునాఁడే ప్రాణములు విడిచెను.

12. ఈసమయముననే మఱియొక విషాదసంఘటనము జరిగెను. నౌకోద్యోగులలో నొకఁడైన కాప్టెను డౌటీ యను వాని వర్తనము డ్రేకునకు మిక్కిలి యనుమానాస్పదముగా నుండెను. మొగడారు రేవు సమీపమునఁ బోర్చుగీసు నౌకను గొల్లఁగొట్టిన సమయమున నాతఁడు విస్తారధనమును స్వార్థ మునకై యుపయోగించెననియు, ననుచరులలోఁ దిరుగఁ బాటును లేకెత్తించుటకై ప్రయత్నించుచుండెననియుఁ గొన్ని సూచనలు కానవచ్చెను. సెంటుజూలియను రేవున నీ విష యమునందలి యాథార్థ్యమును నిర్ణయింపవలెనని డ్రేకు నిశ్చ యించెను. ఆతఁడు తన యధ్యక్షత క్రింద నలువదిమంది నౌకో ద్యోగులతోఁగూడిన యొక న్యాయస్థానము నేర్పఱిచి తత్సమ క్షమున డౌటీ విషయము విచారింప నారంభించెను. సాక్ష్య మంతయు జాగరూకతతోఁ బరిశీలించిన పిమ్మట వారు డౌటీ యపరాధియని నిర్ణయించిరి. ఆంగ్లదేశమునకు ఖైదీగాఁ బంపఁ

బడుట, అమెరికాలో విడిచివేయఁబడుట, ఉరితీయఁబడుట — అను మూఁడుశిక్షలలో నేదోయొకదానిని గోరుకొనవచ్చునని డ్రేకు డౌటీతోఁ బలికెను. ఆంగ్లదేశమునకుఁ దిరిగి పంపఁబడుట మిక్కిలి యవమానమునకుఁ గారణమగుననియు, నమెరికాలో విడిచివేయఁబడిన దేశీయుల చేతులలోఁ జావెట్లును దప్పదనియు నెఱింగియుండుటచే డౌటీ యురిశిక్షనే కోరుకొనెను. మరణమునకుముందు తన నౌకానాయకునితోఁ దానొకసారి మాటాడుట కనుమతినీయవలెనని యాతఁడు వేఁడుకొన డ్రేకందులకు వెంటనే యనుమతి నొసంగెను. ఆ సంభాషణమైన పిమ్మట డ్రేకు డౌటీతో భోజనము కావించెను. అతనితోఁ ద్రాగి పెక్కువిషయములనుగూర్చి యథేచ్ఛముగాఁ బ్రసంగించెను. కాని వారిరువురిలో నెవ్వరుగాని యా సమయమున డౌటికి విధింపఁబడిన శిక్షనుగూర్చి పలుకరైరి. ఉరితీయుటకుముందు డ్రేకు డౌటీయెడ వర్తించిన విధమునుబట్టిచూడ నాతఁడు తప్పక యాతని ననుగ్రహించునని తోఁచును. కాని కఠినహృదయుఁడైన డ్రేకట్టి యౌదార్యమును బ్రదర్శింపఁ బూనుకొనఁడాయెను. డౌటీ యురిశిక్షకుఁ బాలై వింటరు సమాధిప్రక్క భూమిలో స్థాపితుఁడయ్యెను !

13. ఆగష్టు 17 వ తేదీని డ్రేకుసంఘమువారు సెంటు జూలియెనురేవును విడిచి ప్రయాణము సాగించిరి. మూఁడు రోజు లట్లు పయనించి వారు మెగెలాను జలసంధి ముఖమును జేరుకొనిరి. అచ్చట డ్రేకు తన నౌకకుఁ బెలికాను పేరు తీసివైచి గోల్డెనుహిందను నామకరణము చేసెను. పిమ్మట నాతఁ డపాయకరమును బహుళకష్టప్రదము నగు నా

ప్రయాణమునందున్న శతవిధములఁ గాపాడవలెనని భగవంతుని కనేకవందనము లొనర్చి తనమిత్రులతోడను నౌకలతోడను ఆ జలసంధిద్వారా ప్రయాణము సాగించెను. ఇచ్చట సముద్రములో మునిఁగియున్న కొండలబారి పడకుండఁ దమ నౌకలను నడపించుటకు వారు మిక్కిలి జాగరూకత వహింపవలసి వచ్చెను. ఆజలసంధి దాఁటిన తరువాత వారొక ద్వీపములో దిగిరి. డ్రేకు దాని కెలిజబెత్తు ద్వీపమని పేరిడెను. అచ్చటికి సమీపముననేయున్న మఱొకద్వీపమున నాయాంగ్లనావికులకుఁ గొంగలవంటి యొకరకపుఁ బక్షులు కానిపించెను. వారందుఁ బెక్కింటిని జంపి తరువాత నాహారార్థముపయోగించుకొనుటకై తమ నావలపైకిఁ గొనిపోయిరి. అచ్చటి దేశీయులు వారి కెట్టి బాధను గలిగింపకుండుటయే గాక వారియెడ మిక్కిలి సుహృద్భావముతో వర్తిల్లిరి. వారు కట్టిచట్రములపై జంతుచర్మములఁ బఱుపఁగా నేర్పడిన చిన్న గుడిసెలలో నివసించుచు వేఁటాడుటయుఁ జేపలను బట్టుటయుఁ బ్రధానవృత్తులుగా నచ్చట జీవితములు పుచ్చుచుండిరి. వారు సముద్రతీరమున దొరకు నాలచిప్పలనే కత్తులుగా నుపయోగించుచుండిరి. వానిని వాడుటలో వారు చూపుచుండిన నేర్పెంతయో ప్రశంసనీయమై యుండెను.

14. సెప్టెంబరు 6 వ తేదీనాఁటికి డ్రేకు సంఘమువారి నావలు శాంతమహాసముద్రపు దక్షిణభాగమునఁ బయనించుచుండెను. అట్లాంటికు సముద్రమునఁ గంటె నిచ్చట వాతావరణస్థితి మిక్కిలి ప్రశాంతముగా నుండునని డ్రేకు తలంచెను. కాని వారు మెగెలాను జలసంధిని దాఁటిన కొలది కాలము

నకే యొక పెద్ద తుపానురేఁగి వారి నావలను భగ్నక్షీణముగాఁ దోసివైచెను. మేరీగోల్డనునావ సముద్రములో మునిఁగిపోయెను. ఎలిజబెత్తు జాడయే కానరాదాయెను. డ్రేకు నావయైన గోల్డెనుహిందుకూడ దక్షిణముగా హారన్గ్రము వఱకుఁ గొట్టుకొని పోయెను. అచ్చట నొక ద్వీపములోఁ దన నావను బాగుచేసికొనుటకై డ్రేకు కొన్నివారము లాగెను. అక్టోబరునెల ముగియఁగనే యనుకూలవాయువులు వీవఁ దొడంగుటనే డ్రే కెలిజబెత్తను నావ జాడ లెచ్చటనైన గోచరించునేమో యని చూచుకొనుచు నుత్తరదిశగాఁ బ్రయాణము సాగించెను. అతఁడు జలాహారముల నిమిత్తమై యచ్చటచ్చట నాఁగుచుఁ దీరము వెంబడినే యొక నెలదినములు ప్రయాణముచేసి నవంబరునెల చివరికి వాల్పరైసో కుత్తరమునఁ గొన్నిమైళ్ళ దూరములోనున్న యొక యఖాతముఁ బ్రవేశించెను. అమెరికాదేశవాసి యొకఁడొక్క యుడుపముపైనా నావదగ్గఱ కరుదెంచి, తన్నివాసులవలన వారి కాహారపదార్థములు కావలెనని యెఱింగి, వెనుక కేగి, వెంటనే కొన్ని కోడిపెట్టలను, గ్రుడ్లను, క్రొవ్విన యొక వరాహమును గొని మరలివచ్చెను డ్రే కాతని సౌహార్దౌదార్యముల నెంతయో కొనియాడెను. కాని యాతఁడు గొనివచ్చిన పదార్థములు నావలోనున్న యఱువదిమందికిని గొలఁది దినములుమాత్రమే సరిపోయెను. అప్పుడా యమెరికా ఖండవాసి డ్రేకు ప్రార్థనపై నాతని నౌకపైకెక్కి దానిని దీరమువెంట దక్షిణముగా నడపుచు వాల్పరైసోకుఁ గొనిపోయెను. డ్రేకున కచ్చట వలసినన్ని యాహారపదార్థములు లభించెను. డ్రేకు సంఘమువారికిఁ

ప్రథమపర్యాయ మెక్కువగా ధనము లభించినదికూడ నిచ్చటనే.

15. వాల్పరైసో రేవున స్పెయినువారికిఁ జెందిన యొక నౌక లంగరు వేయఁబడియుండెను. ఆంగ్లేయులందుఁ ప్రవేశించినంతనే యందలి నావికు లత్యంతాశ్చర్యమగ్నులైరి. ఆ నౌకలో 1800 మృత్పాత్రిలలో శ్రేష్ఠమైన మద్యమును, 25000 బంగారు నాణెములును నుండెను. ఆంగ్లేయులు స్పెయినువారిని దఱిమి వానిని దమ వశము కావించుకొనిరి. పిమ్మటవారు నగరములోని కరుగఁ దన్నివాసులు వారిని గనినంతనే భయాగస్తులై పరువెత్తిరి. అంతవారు నిరాటంకముగా నందలి దేవాలయములు చొచ్చి విశేషమైన వెండిబంగారములు కొల్లఁగొట్టిరి. ఈ సంఘటనము డ్రేకు ననుచరుల కపారమైన యుత్సాహము కలిగించెను.

16. వాల్పరైసోనుండి డ్రేకుత్తరముగాఁ బయనించి పతుమురోజులైనపిమ్మట కొక్వింబోకు దక్షిణముననుండిన యొక యఖాతములోఁ దన నావను నిల్పెను. అచ్చటనుండి యాతఁడు పదునల్గు రనుచరులు వెంటరాఁ దీరమున కరిగెను. అచ్చటి పట్టణము స్పెయినువారి చేతులలోనుండెను. ఆంగ్లేయులు తీరమునకు రాఁగనే పలువురు దేశీయులును, మూఁడువందల మంది యశ్వారూఢులైన స్పెయినువారును వారిని మార్కొనిరి. తనతోనున్న యల్పసంఖ్యాకులతో వారి నెదిరించుట దుష్కరమని యెఱింగి డ్రేకు తన యనుచరులను వెంటనే పడవకడకుఁ బొమ్మని యాజ్ఞాపించెను. మూర్ఖుఁడైన యొక యాంగ్లేయనావికుఁ డాతని మాట పెడచెవిని బెట్టి యొక ఱాతి

గుట్టపై నిల్చి స్పెయినువారిపై తూలు రువ్వ మొదలిడెను. దేశీయులు విసరిన వాఁడిబాణముల కెరయై యాతఁడు వెంటనే నేలఁగూలెను. పిమ్మట స్పెయినువారి ప్రోత్సాహమున దేశీయులు చూపిన క్రౌర్యము డ్రేకున కమితమైన కోపము కలిగించెను. స్పెయినువారి యానతి ననుసరించి యిరువురు దేశీయులు క్షతగాత్రుఁడైన యా యాంగ్లేయ నావికుఁడు పడియుండిన చోటికరిగి, యాతని తలను, దక్షిణహస్తమును నఱకివైచి, మిగిలిన శరీరమును పైకెత్తఁగా, దేశీయులందఱును దానిపైఁ బెక్కువాఁడి తూఁపులు పరగించి, లక్ష్యశుద్ధి నలవఱుచుకొనుచు వినోదింప మొదలిడిరి. పడవనుండి యాదృశ్యమును జూచుచుండిన డ్రేకు కోపమునఁ బండ్లు పటపటలాడించెను. అట్టి రాక్షసకృత్యమునకు దేశీయులఁ బ్రేరేచిన స్పెయినువారిపైఁ గసితీర్చుకొనుటకుఁ దగినంత బలము తనకడ లేకపోయెను గదాయని డ్రేకు మిక్కిలి విచారించెను.

17. పిమ్మట నచ్చటనుండి యుత్తరముగాఁ బయనించి డ్రేకు నొక జలముకొఱకై యొక్కచోట నాగెను. ఆంగ్లేయులు తీరమున కేగి తిరుగుచుండ వారికి నిద్రించుచున్న యొక స్పెయిను దేశీయుఁడు కానిపించెను. ఆతనిప్రక్కనే యొక సంచిలో నాలుగువేల వెండినాణెము లుండెను. దయామయులైన యాంగ్లేయు లాతని కచ్చట నిద్రాభంగము కలుగునోయని యల్లనల్లన యాతనిఁజేరి యా వెండినాణెముల సంచి నపహరించి యాతని బరువు తగ్గించిరి! కొన్నిరోజులైనపిమ్మట మఱియొక చోట నొక స్పెయినుదేశీయుఁ డొక్కొక్కదానిపై నేఁబది పౌనుల వెండి యిడి యెనిమిది లామాగొఱెలను దోలుకొని

పోవుచుండెను. ఆంగ్లేయనావికు లాతనిఁగాంచి, "పాపము ! నీవొక్కఁడవు నింత కష్టపడుచుండుట మేముచూచి సహింప లేము. గమ్యస్థానమునకు వీనిని దోలుకొనిపోవుటలో నీకుఁ గొంత సాయముచేయవలెననియున్నది. ఏమందు"వని పరిహాస గర్భముగాఁ బలికి యా గొఱ్ఱెలను దమ నౌకయున్నచోటికిఁ దోలుకొనిపోయిరి. పిమ్మట వారా స్పెయినుదేశీయునిచేతనే యా గొఱ్ఱెలపైనున్న వెండినంతను గోనెసంచులలోనికి మోయించిరి. ఒంటరియైన యా స్పెయినుదేశీయుఁ డేమిచేయు టకును దోఁపక యాంగ్లేయులు చెప్పినట్లెల్ల ననుసరించి పిమ్మ ట నుమ్మలించుచు యథేచ్ఛం బోయెను.

18. ఫిబ్రవరి 7 వ తేదీనాఁటి కాంగ్లేయుల నౌక యారికాచేరెను. అచ్చట స్పెయినువారినౌకలు పెక్కు వేచి యుండెను. అందలి నావికులందఱును బట్టణములోని కరిగి యుండుటచే డ్రేకు తన యనుచరులతో నానౌకలలోఁ బ్రవే శించి, యందలి యమూల్యవస్తువులనెల్లఁ గొల్లఁగొట్టి, వాయు వనుకూలముగా వీచుచుండుటచే లంగరులెత్తి వానిని సము ద్రములోనికి విడిచివైచెను. వాయుప్రేరితములై యానౌక లన్నియుఁ దలకొకదిక్కునకుఁ జెదరిపోయెను. పట్టణములోని కరిగియుండిన స్పెయినువారు రేవున కరుదెంచి తమ నౌకలు సముద్రమునఁ బడిపోవుచుండుట గాంచి యతికష్టముమీఁద మరల వానిని రేవునకుఁ జేర్చుకొనఁగలిగిరి. వారమురోజులైన పిమ్మట నాంగ్లేయులు కాలో నౌకాశ్రయముచేరి యచ్చట నున్న ముప్పది స్పెయినువారి నావలనుగూడఁ గొల్లఁగొట్టి నగ రమునకేగిన స్పెయినునావికులు తిరిగి రాకముందే తొందరగా

నౌకవిడిచి వెడలిపోయిరి. స్పెయిను నావికులు వచ్చినచోఁ దమకు హానిగలిగింతురేమోయను భయమేకాక యగ్నివికిర మను నరకముతోడి పేరుగల యొక స్పెయినునావ విస్తారధన రాసులతోఁ బెనామావైపునకుఁ గొన్నిగంటలకుఁ బూర్వమే వెళ్ళియుండెనని వినుటయు నాంగ్లేయుల సత్వరగమనమునకుఁ గారణమయ్యెను. కొంత శీఘ్రముగాఁ బోయినచో నానావను గూడఁ గలసికొని యందలి ధనరాసులను గొల్లఁగొట్టవచ్చునని చెప్పుచు డ్రేకు తన యనుచరుల కుత్సాహము కలిగించెను. కాని వారింకను దీరమునుండి దవ్వుగా నరుగకపూర్వమే స్పెయినునావికులు రెండు పెద్దనావలలో వారిని వెంబడించి వచ్చుచున్నట్లు కానిపించెను. డ్రేకది గాంచి గోల్డెనుహిందును సత్వరముగా నడిపింపఁ దనయనుచరుల కాజ్ఞాపించెను. కొంత దూరము చనినపిమ్మట గాలి పూర్తిగాఁ దగ్గిపోవుటచే నావికు లెంతగా యత్నించినను గోల్డెనుహిందు కదలక నిశ్చలముగా నిలిచిపోయెను. స్పెయిను నౌకలు క్రమక్రమముగా దానిని సమీపించుచుండెను. భగవంతుఁడు తప్ప నాసందర్భమునఁ దమ్మింకెవ్వరును గాపాడఁజాలరని తలంచి యాంగ్లేయులు ధ్యానమగ్నులైరి. అదృష్టవశమున సముద్రమునఁ దరంగములు కదలాడఁజొచ్చెను. హఠాత్తుగా వాయువు దివ్వన వీవ మొదలిడెను. ఆంగ్లేయులమోములు వికసించెను. గోల్డెనుహిందు వాయువేగమున సముద్రజలమును జీల్చుకొనుచు ముందుకు వేవేగ పోఁజొచ్చెను. తమకును దానికిని గ్రమక్రమముగా దూరము హెచ్చుచుండుటచే నింక లాభము లేదని స్పెయిను వారు వెంబడించుటమాని తమ నౌకలను వెనుకకు మరలిం

చిరి. ఆ సమయమున గోల్డెనుహిందు స్పెయినువారికిఁ జిక్కుటయే సంభవించియుండినయెడల నాంగ్లేయులు ధనప్రాణములకుదూరులై దారుణమరణమునకుఁ బాల్పడియుందురు.

19. అంతకుముం దేగిన స్పెయినునావను బట్టుకొనవలెనను నుద్దేశముతో నాంగ్లేయు లింకను నౌకను వేగముగనే నడపుచుండిరి. అగ్నివికిరమును ముమ్ముందు చూచిన వారికిఁ దన మెడలోనున్న బంగారుగొలుసు బహుమానముగా నొసంగెదనని డ్రేకు వాక్రుచ్చియుండెను. గోల్డెనుహిం దావేగమును గొనసాగింపఁగలిగినచోఁ బెనామా చేరకుండనే యా స్పెయిను నౌకను బట్టుకొనవచ్చునని డ్రేకు విశ్వాసపూరితుఁడై యుండెను. తన నావ ఫ్రాన్సిస్కో-అగ్రమును దాఁటినంతనే యగ్నివికిరముజాడ నారయుటకై యాంగ్లేయ నావికు లందఱును దానియుపరిభాగమున కెక్కి యఱ్ఱులెత్తి చూడఁదొడంగిరి. కొంతసేపైనపిమ్మట నొక నావికుఁ డానందాతిరేకమున "అదిగో! తెరచాప"యని బిగ్గరగా నఱచెను. అందఱు నాతఁడు చూపిన దిక్కునకు దృష్టులు నిగిడించిరి. క్రమక్రమముగాఁ దెరచాపయేకాక యగ్నివికిరమంతయు వారికి దృగ్గోచరమయ్యెను. వారి యానందమునకు మేరలేదయ్యెను. తమ యోడ నా శత్రునౌకకు సమీపముగాఁ బోనిచ్చి యాంగ్లేయులు దానిపైఁ గొన్ని తుపాకిగుండ్లు ప్రేల్చిరి. ఒక గుండు దెబ్బచేఁ దెరచాపకొయ్య విఱుగుటచే నగ్నివికిర మసహాయమై యాంగ్లేయులకు వశమయ్యెను. డ్రేకందలి ధనరాసులను బరీక్షింపకముందే యితరనావల కంటఁబడకుండ దానిని దీరమునకు దూరముగాఁ గొనిపోయి యందలి ధనమంతయు

గోల్డెనుహిందు లోని కెక్కింప ననుచరుల కాజ్ఞాపించెను. అందు రత్నములు, నగలు, వెండి, బంగారము మున్నగు నమూల్య వస్తువు లెన్నో యుండెను. ఇప్పటి మూల్యమునుబట్టి వాని వెల సుమారు పదిలక్షల పౌను లుండునట. ఆ వస్తువు లన్నిటిని దమనావలోనికి మార్చుట కాంగ్లేయనావికులు సుమా రొక వారమురోజులు శ్రమపడవలసివచ్చెను. గోల్డెనుహిందు గర్భమంతయు వెండి బంగారములతో నిండిపోయెను. డ్రేకు తన మనోరథము పూరితమగుటచే సాధ్యమైనంతత్వరలో మాతృదేశమునకు మరలిపోదలంచుచుండెను. స్పెయినువా రెవరైనం దమ్ముం బట్టుకొన్నచో నింతకష్టపడి యార్జించిన సొత్తంతయు వారి యధీనమైపోవునని యాతని భీతి.

20. ఉత్తరపూర్వముగాం బయనించి యట్లాంటికు సముద్రముద్వారా ఆంగ్లదేశమును జేరవలెనను సంకల్పముతో డ్రేకు నావ నమెరికా పడమటి తీరమువెంటం బోనిమ్మని నావికుల కాజ్ఞాపించెను. గోల్డెనుహిందు సంపత్సంపూరితో దరమై సుమారారువారము లుత్తరముగా బయనించెను. అది కనడా తీరమునకుం జేరినంతనే శీతబాధ యసహ్యమయ్యెను. శీతల ప్రదేశములలో ధరించుట కనువగు దుస్తులు లేనందున నావికులందఱు నుత్తరముగాం బోయి యట్లాంటికు మహాసముద్రమునకు మార్గము కనుంగొను యత్నమునుండి విరమింపుమని డ్రేకును బ్రార్థించిరి. సరిగా నా సమయమున నుత్తరదిక్కునుండి సహింపశక్యముగాని చలిగాలులు వీచియుండనిచో డ్రేకా ప్రయాణమును గొనసాగించియే యుండును. కాని యా గాలుల యపారశైత్యమునకు వెఱచి డ్రేకు శాన్‌ఫ్రాన్సిస్కో

నౌకాశ్రయమునఁ దల దాచుకొనవలసి వచ్చెను. అచ్చటికేగు సరికి గోల్డెనుహిందు పెక్కుచోట్లఁ దూంట్లుపడినట్లు తెలియ వచ్చెను. అంతట డ్రేకు దారుశిలాదులతోఁ దీరమున నొక కుటీరమును గట్టించి నావలోని ధనమంతయు నందులో సురక్షితము చేయించెను. దేశీయుల సహాయముతో నావికులా కుటీరము నహర్నిశము కాపాడుచుండిరి. గోల్డెనుహిందు బాగుపడుటకు సుమారు మూఁడునెలలు పట్టెను. పిమ్మట డ్రేకచ్చట నున్న యొకదృఢమైన స్తంభమునకుఁ దన యాగమనమును సూచించు వాక్యములతోఁ గూడిన యొక యిత్తడిరేకు నతికి శాంతమహాసముద్రముద్వారా స్వదేశమునకు బయలుదేఱెను. వాతావరణము మిక్కిలి సుముఖముగా నుండుటచే నఱువది యెనిమిదిరోజుల కనుకూలవాయువులు వారి నౌకలను మార్క్విసియాదీవులకడకుఁ గొనిపోయెను.

21. మొట్టమొదట వారు కారోలైను ద్వీపములను సమీపించిరి. వారి నౌక యచ్చటికిఁ జేరఁగనే యచ్చటి పల్లెవారు చిన్న దోనెలలో గోల్డెనుహిందుకడ కరుదెంచి దానిపై కెక్కిరి. అందుచే వారిని సూక్ష్మముగఁ బరిశీలించుట కాంగ్లేయుల కవకాశము కలిగెను. వారు భారవంతములును పెద్దవియునగు కర్ణాభరణములను ధరించిరి. వారి పండ్లు మిక్కిలి నల్లగా నుండెను. కొందఱి వ్రేళ్ళపై నఖము లంగుళముకంటె నెక్కువపొడవై భీకరముగానుండెను. అన్నిటికంటె వారిని గూర్చి చెప్పఁదగిన విశేషమేమన వారు పుట్టుదొంగలు. వారిలో నొకఁ డొకనావికుని తోలుపటకానుండి ధగధగ మెఱయుచున్న పిడిగల ఛురిక నపహరింప యత్నించెను.

అదిగాంచి యాంగ్లేయులు వారి నోడనుండి తఱుమ నారంభించిరి. కాని వారది లెక్కచేయక పండ్లికిలించుచు వికటనృత్యములు చేయసాగిరి. అంత డ్రేకొక పెద్దతుపాకిని వారి శిరస్సులకుఁబైగాఁ బ్రేల్పనాజ్ఞయొసంగెను. ఒక నావికుఁడట్లు చేయఁగనే యీ బెస్తలు భీతభీతులై సముద్రములోని కుఱికి యీదుకొనుచుఁ బాఱిపోయిరి. వారిలో మిక్కిలి ధైర్యము కలవాఁడుకూడ గోల్డెనుహిందు కనుచూపుమేర సాగిపోవునంతవఱకుఁ దనతల జలోపరిభాగమున నుంచుటకు వెనుదీసెను. డ్రేకాద్వీపములకుఁ జోరద్వీపములని సార్థకనామధేయమిడెను.

22. అచ్చటనుండి యాంగ్లేయులనావ పడమరగా బయలుదేఱి ఫిలిప్పైను ద్వీపములదాఁటి మొలక్కా ద్వీపములలో నొకటగు టెర్నేటుద్వీపమును జేరెను. ఇచ్చట నాద్వీపము నేలురాజు వారినౌకను దర్శింప నరుదెంచెను. ముందుముందాద్వీపముతో వర్తకవ్యాపారము నడుపవలసిన యక్కఱ కలుగు నేమోయని డ్రేకాతనికి మిక్కిలి గౌరవముతో స్వాగతమొసంగెను. అతఁడు వచ్చుసమయమున గోల్డెనుహిందు చిత్రచిత్రపతాకలతో నలంకరింపఁబడెను. ఆతఁడు వచ్చుచున్న పడవ దృగ్గోచరమైనవెంటనే యాంగ్లేయు లాతని గౌరవించు నుద్దేశముతోఁ బెక్కు తుపాకులు ప్రేల్చిరి. ఆశబ్దమున కారాజు చోరద్వీపనివాసులయంత కాకపోయినను మిక్కిలి భీతినొందెను. కాని గోల్డెనుహిందు చేరుసరికి మరల స్వస్థత నొందెను. డ్రేకాతని కఖండమైన స్వాగతమొసంగెను. ఆతఁడు గోల్డెనుహిందులోని భాగములన్నియుఁజూచి, యానందించి,

యాంగ్లేయుల వీడోర్ని ద్వీపమున కేగుటయేతడవుగా వారికి నారికేళములు, పంచదార, సగ్గుబియ్యము మున్నగు వస్తువులు కానుకగాఁ బంపుటయేకాక వారిని దనభవనమున కతిథులుగా రమ్మని యాహ్వానించెను. డ్రేకు తన యనుచరుల మాటలనుబట్టి యాతఁడు తమ కేదైన ద్రోహముతలపెట్టునేమో యని సందేహించి యారాజుభవనమునకు వెళ్ళుటమానెను. కాని యీసందర్భమున నారాజు ననుమానించుట కేవల భీతి చేతనేయని తరువాతఁ దెలియవచ్చెను.ఏలయన నాతఁడు తనభవనమునకరుదెంచిన యొక రిరువు రాంగ్లేయనావికులకు హృదయపూర్వకమైన స్వాగతమొసంగి యఖండగౌరవ మొనరించెను.

23. బహుద్వీపసంకులమైన యిచ్చటి సముద్రమునఁ బ్రయాణముచేయుట యాంగ్లేయనావికులకు మిక్కిలి కష్టమనిపించెను; తా మిన్నినాళ్ళు కష్టపడి సంపాదించిన ధనమేకాక తమ ప్రాణములుకూడఁ బోవునేమోయని వారు భీతిల్లఁ జొచ్చిరి. వారు భయపడినట్లుగానే టెర్నేటుద్వీపమును విడిచి వచ్చిన కొంతదూరమునకు గోల్డెనుహిం దొక పవడపుఁగొండ శిఖరమును దాకి పెద్ద శబ్ద మొనరించెను. నావ తుత్తునియలై పోయెనని నావికులు భావించిరి. కాని యదృష్టవశమున దానికెట్టి యుపాయమును జేకూరలేదు. అచ్చట సముద్రము పోటుతోనుండుటచేఁ దరంగములు గోల్డెనుహిందును ముంచి వేయునని సందేహించి యాంగ్లేయు లందలి తుపాకులు, ఆహారపదార్థములు కొన్ని సముద్రమునఁ బాఱవైచి దానిని గొంత తేలిక కావించిరి. ఇంతలో నొక బలమైన వాయువు వీచుటచే నావ ప్రవాళద్వీపమును రాచుకొని లోతునీటిలో

నికిఁ బోయెను. ఆంగ్లేయులు చచ్చినవారు మరల బ్రతికినట్లు సంతోషించిరి. తరువాత సుమారు మూఁడునెలలకాల మతి పెద్ద తుపానులలోను సాపాయములైన తీరములందును బ్రయాణముచేసి వారు నిరుపద్రవప్రదేశమును జేరిరి. అచ్చటచ్చట వారికిఁ గానఁబడిన దేశీయు లందఱును వారియెడ సుముఖులై సౌహార్దమును వెల్లడించిరి. ఆంగ్లేయులు వారి దగ్గఱనుండి కొబ్బరికాయలు, మిరియములు, సగ్గుబియ్యము, దోసకాయలు కొని వారికిఁ దగిన మూల్య మిచ్చుచుండిరి.

24. మార్చి 9 వ తేదీనాఁటికి గోల్డెనుహిందు జావా ద్వీపము చేరెను. ఆంగ్లేయు లందఱును దిగి ద్వీపములోని కేగిరి. ఆ ద్వీపము నేలు రాజు వారిని మిక్కిలి గౌరవించెను. ఈ సమయమునకు గోల్డెనుహిందు పలుచోట్లఁ దెబ్బలుతిని యుండుటచే మిక్కిలి శిథిలావస్థయందుండెను. డ్రేకు దాని నచ్చటఁ బూర్తిగా బాగుచేయించెను. ఆ పని పూర్తియగు సరి కొక పక్షముకాలము పట్టెను. ఈ కాలమున నాంగ్లేయులును జావాద్వీపపురాజును బరస్పర స్నేహబద్ధులై తఱుచుగా నొండొరుల దర్శించుచు సంతోషముగాఁ గాలము పుచ్చిరి. మార్చి 26 వ తేదీ నాంగ్లేయులు జావాద్వీపమునుండి బయలుదేఱిరి. వారు పలురకములైన ఫలములను, మేకలను, గోడిపెట్టలను జావాద్వీపవాసులదగ్గఱఁ గొని తమ నౌకలో నిలువచేసిరి. తరువాత రెండునెలలకాల మనపాయముగఁ బ్రయాణ మొనరించి వా రాఫ్రికాదక్షిణతీరముఁ జేరి, గుడ్‌హోప్అగమును దాటి, జూన్ 15 వ తేదీనాఁటికి సెరాలియోనుకడ నాగిరి. ఇంగ్లండుచేరుటకు ముందు వారు చిట్టచివర నాగిన స్థల

మిదియే ఇచ్చట మంచినీరు కొంత నావలోనికిఁ దెచ్చుకొని, మరలఁ బ్రయాణమై, ఇంగ్లీషు ఛానెలు దాఁటి క్రీ. శ. 1580 వ సంవత్సరము సెప్టెంబరు 25 వ తేదీనాఁటికి వారు ప్లిమత్తు రేవు కాశ్రయము చేరిరి.

25. డ్రేకు ప్రపంచ పర్యటనముగావించి, మెగెలాను జలసంధిదాఁటి, స్పెయినువారి నడంచి, విస్తారధనముతోఁ దిరిగి వచ్చినపుడు వినినతోడనే యాంగ్లేయులందఱు నాతనికిని దదనుచరులకును మహోత్సాహముతో స్వాగతమొసంగిరి. కాని సహజప్రజ్ఞచే నద్భుతకార్యము లొనరించి పేరుగడించిన యితరులకువలెనే డ్రేకునకును గొంతమంది శత్రువులు లేకపోలేదు. కొందఱాతఁడు క్రొత్తగాఁ గనుఁగొనిన ద్వీపము లంత ప్రధానములు కావనియుఁ, గొందఱాతఁడు స్పెయినువారిని బలువిధముల శిక్షించి వారి నింగ్లండునకు శాశ్వతవైరులనుగా నొనరించెననియు నాతనిపై నిందలు మోపసాగిరి. స్పెయినువారు కూడ డ్రేకు తమయెడఁ గడుంగడు ననుచితముగా వర్తించెనని యెలిజబెత్తు రాణితో మొఱపెట్టుకొనిరి. ఎలిజబెత్తు వారి మాటలు లెక్కచేయలేదు కాని కొన్ని దినములవఱకు డ్రేకునెడ వైముఖ్యము చెందినట్లు నటించెను. మరుసటి సంవత్సర మేప్రిలు మాసమున నామె భయసందేహముల నన్నింటిని వీడి గోల్డెనుహిండుపై డ్రేకును సందర్శింప నేగెను. డ్రేకామెను గౌరవించుటకై గొప్ప విందు సిద్ధముకావించెను. ఆవిందు ముగిసినపిమ్మట రాణి డ్రేకు సాహస పరాక్రమముల ననేకవిధములఁ బ్రశంసించి యాతనికి "సర్" బిరుదము ప్రసాదించెను.

---

